పోతన రామాయణము : : **Potana Ramayanamu**

ప్రథమ ప్రతి First Edition online : 2013

ద్వితీయ ప్రతి Second Edition online : 2017

తృతీయ ప్రతి Third Edition : 2121 April

రచయిత writer:

జాతీయమహాకవి, తెలుగుల పుణ్యపేటి, సహజ కవి బమ్మెఱ పోతనామాత్యులు

Greatest National Poet, Telugula Punya Peti, Bammera Potanamatya

వెల : ఉచితం



సంకలనం : భాగవత గణనాధ్యాయి,
ఊలపల్లి సాంబశివ రావు

ప్రచురణ : తెలుగు భాగవత ప్రచార సమితి

Publishing : Telugu Bhsgavata Prachara Samiti

సౌజన్యము : : https://telugubhagavatam.org/

# శ్రీ పోతన రామాయణము

**బమ్మెఱ పోతనామాత్య ప్రణీతము**

**సంకలనం**

**భాగవత గణనాధ్యాయి**

**సౌజన్యము**

https://telugubhagavatam.org/

ప్రచురణ

తెలుగు భాగవత ప్రచార సమితి

**2021 ఏప్రిల్**

# పూర్వ పీఠిక

భారతీయ వాఙ్మయ, ఆధ్యాత్మిక మహాకాశ మనే ముక్కాలి పీటకు కోళ్ళు రామాయణం, భారతం మఱియు భాగవతం అని చెప్పవచ్చును. వీనిలో శ్రీమద్రామాయణం, శ్రీమద్భారతం రెండూ ఇతిహాసాలు కాగా శ్రీమద్భాగవతం మహాపురాణం. శ్రీమద్రామాయణం ఆదికావ్యం. ఆదికవి వాల్మీకి మహర్షి కృతం. సాక్షాత్ వినాయకుడే వ్రాయసకాడు. ఇంతటి మహిమాన్వితమైన రామాయణానికి నాయకశిరోమణి శ్రీరామచంద్రులవారు శ్రీమహావిష్ణువు అవతారం. నాయకోత్తమురాలు సీతమ్మ తల్లి లక్ష్మీదేవి అవతారం. సీతారాములు మన తెలుగువారికి ఇలవేల్పు కానీ లేదా ఆరాధ్యదేవత కానీ. అది ఎంత ఇదిగా అంటే రామాలయం లేని పల్లె, ఊరు తెలుగు ప్రాంతంలోనే లేదు. తెలుగునేలలో రామాయణ పారాయణ కూడా విస్తృతంగా ఉన్నదే.

శ్రీమద్రామాయణాన్ని మించిన కావ్యం ప్రపంచంలో నభూతో నభవిష్యతి. మహోన్నతమైన శ్రీరాముని వ్యక్తిత్వాన్ని నిర్వచించిన తీరు అనితర సాధ్యం. ధర్మానికి ప్రతిరూపం, ఆదర్శ తనయుడు, ఆదర్శ మహారాజు, తిరుగులేని శూరాధిశూరుడు. రామరాజ్యం అని ఇప్పటికీ చెప్పుకుంటున్నాం అంటే ఎంతటి పాలనాసామర్థ్యం ధర్మబద్ధత. సీతమ్మతల్లి మహాసాధ్వి పంచపతివ్రతలలో ఎంచ దగ్గది. మహారాక్షసుని బందీగ ఉన్నా, ఎట్టి తడబాటు లేక ఏమాత్రం లొంగక గడిపిన మహాధీరురాలు. జీవితాంతం శ్రీరాముని, భావనలో కూడా, విడువని మహాసాధ్వి. లక్ష్మణమూర్తి మూర్తీభవించిన తమ్ముడు, సేవాతత్పరతకు మారుపేరు. హనుమంతుల వారు భక్తితత్వానికి, వ్యక్తిత్వ దృఢత్వానికి, కార్యనిర్వహణా దక్షతకు, భక్తపాలనకు ఎదురులేని ఉదాహరణ. ఇలా చెప్పుకు పోతుంటే ఆ సజీవ పాత్రలకు అంతూ పొంతూ లేదు కనుక ఇక చెప్పుకోడం ఆపుదాము.

శ్రీమద్భాగవతం, శ్రీమద్రామాయణానికి సరిసాటి అయిన మహా పురాణరాజం. ఇది సకల పురాణాలూ, భారతమూ రచించిన శ్రీ వేదవ్యాస మహర్షి కృతం. పండితులకు కూడా కొరకానికొయ్య అని అంటారు. శ్రీమదాంధ్రమహాభాగవతం పేరుతో తెలుగీకరించిన మహానుభావుడు తెలుగుల పుణ్యపేటి జాతీయమహాకవి బమ్మెఱ పోతనామాత్యులవారు. అంతటి కఠినతరమైన దానిని అలతి పొలతి పదాలతో ఆబాలగోపాలం మహదానందంగా ఆస్వాదించేలా రూపొందించాడు.

ఇమ్మహాభాగవత ప్రపంచంలో రామాయణం ఉత్తరరామాయణ సహితంగా సంక్షిప్తంగా బహు మనోహరంగా సహజ చాతుర్యంతో అందించారు పోతనామాత్యులవారు. అదే ఈ పోతన రామాయణం. హాయిగా ఆస్వాదించండి.

# ఉత్తర పీఠిక

ఇక్ష్వాకు వంశంలోని ఖట్వాంగుని చరిత్ర, శ్రీరాముని అవతారం, సీతాస్వయంవరం, కాననలకేగుట, సుగ్రీవ హనుమంతులతో కలయిక, వారధి కట్టడం, రావణాసుర వధ, లవకుశుల విషయం, అవతారం చాలించడం, తరువాతి రాజుల వివరము సహితంగా సహజకవి బమ్మెఱ పోతనామాత్యులవారు, భాగవత ఆంధ్రీకరణలో అందించారు. వారి అమృత గంటం పంచదారలో ముంచి వ్రాసారేమో మధురాతి మధురంగా ఉంటుంది. వారి సహజ శైలి ప్రతిఫలిస్తూ ఆబాలగోపాలాన్ని తెలుగు సంస్కృత ప్రియులందరినీ అలరిస్తూనే ఉంది. భాగవతాంతర్గతా వెలిగిపోతున్న పోతన రామాయణం ఆరువందల ఏళ్ళు గడిచినా అనుభవోపయోగ్యమై అలరారుతోంది. ఈ పోతన ప్రసాదాన్ని ఎప్పటినుంచో పారాయణ చేసుకుంటూ తరిస్తున్నారు తెలుగు ప్రజలు.

పోతన తెలుగు భాగవతం పేర, తెలుగుభాగవతం.ఆర్గ్ మున్నగు వివిధ సాంకేతిక మాధ్యమాలలో తెలుగు వాడుకరులకు అందుబాటులోకి వచ్చింది. తదంతర్భాగమైన నవమ స్కంధ మందు కల సీతారామ చరితం గ్రహించి ఇలా పోతన రామాయణ రూపంలో ప్రచారం చేస్తున్నాం. ముఖ పుస్తకం, వాట్స్ ఆప్ సత్సంగాలలో భాగవత బంధువు ముందు నుండీ పంచుతూనే ఉన్నారు. ఆస్వాదించి తరిస్తున్నారు ఆయా సత్సంగ సభ్యులు. ఆ క్రమంలో భాగవత సాధనలోని సాధకులకు అందించుట కోసం ఈ తృతీయ ప్రచురణ వెలువడింది. ఇది యథాప్రకారం https://telugubhagavatam.org/ సౌజన్యంతో తెలుగు భాగవత ప్రచార సమితి తరఫున ఉచితంగా అందుతోంది.

ఇందులోని అమృతగుళికలు 'అమరేంద్రాశకు', 'భూతలనాథుడు', 'జనకుడు పనిచిన', 'నిగ్రహము నీకు వలదిక', 'లీలన్', 'అలవాటుకలిమి', 'కట్టుముసేతువు', 'కవగూడి యిరుదెస', 'తండ్రి క్రియ'. 'కలుగుటెల్లను మానె', 'సిగ్గుపడుట కల్గి', 'చిన్నియన్నలార', 'నల్లనివాడు', 'ఆదిదేవు డైన' , 'శోషితదానవుండు' మొదలగునవి సాధన చేస్తుంటే అలా మనసులో మెదులుతూ ఉంటాయి. అంతకన్నా కావలిసింది ఏముంది.

ఈ పోతన రామాయణం ఆదరించి ఆస్వాదించి ఆనందించే మా సాధకులూ మఱియూ ఇతర భాగవతాభిమానులు, భక్తులు అందరికీ వారి వారి కుటుంబ పరివార సమేతంగా చక్కటి ఆయురారోగ్యాలూ సుఖసంతోషాలు మా నల్లనయ్య అనుగ్రహించు కాగ.

~ భాగవత గణనాధ్యాయి, 30-04-2021.

# విషయ అనుక్రమణిక

_Toc70678049

శ్రీరామ

# శ్రీ పోతన రామాయణము

## ప్రార్థన



9-1-క.

శ్రీరాజిత! మునిపూజిత!

వారిధి గర్వాతిరేక వారణ బాణా!

సూరిత్రాణ! మహోజ్జ్వల

సారయశస్సాంద్ర! రామచంద్ర నరేంద్రా!

టీక:- శ్రీరాజిత = రామా {శ్రీరాజితుడు - శ్రీ (రాచరికము, బుద్ధి)చేత రాజితుడు (ప్రకాశించెడి వాడు), రాముడు}; మునిపూజిత = రామా {మునిపూజితుడు - మునులచే పూజింపబడువాడు, రాముడు}; వారిధి గర్వాతిరేక వారణ బాణా = రామా {వారిధిగర్వాతిరేకవారణబాణుడు - వారిధి (సముద్రుని) గర్వాతిరేక(గర్వాతిశయమును) వారణ (వారించిన) బాణుడు (బాణముగలవాడు), రాముడు}; సూరిత్రాణ = రామా {సూరిత్రాణుడు - సూరి (పండితులను) త్రాణుడు (కాపాడెడివాడు), రాముడు}; మహోజ్జ్వలసారయశస్సాంద్ర = రామా {మహోజ్జ్వలసారయశస్సాంద్రుడు - మహా (గొప్ప) ఉజ్జ్వల (ప్రకాశవంతమైన) సార (చేవగలిగిన) యశస్ (కీర్తి) సాంద్రుడు (దట్టముగాగలవాడు), రాముడు}; రామచంద్రనరేంద్రా = రామా {రామచంద్రనరేంద్రుడు - రాముడనెడి చంద్రునివంటివా డైన నరేంద్రుడు (రాజు), రాముడు.}.

భావము:- లక్ష్మిగలిగి ప్రకాశించే వాడా! మునులు పూజించు వాడా! సముద్రుడి గర్వం సర్వం పోగొట్టిన బాణం గల వాడా! పండితులను కాపాడే వాడా! బహు ప్రకాశవంతమైన గొప్పకీర్తి గల వాడా! శ్రీరామచంద్ర ప్రభూ! అవధరించు.

## శ్రీరాముని కథనంబు

9-258-వ.

అట్టి ఖట్వాంగునకు దీర్ఘబాహుండు, దీర్ఘబాహునకు రఘువు, రఘువునకుఁ బృథుశ్రవుండుఁ, బృథుశ్రవునకు నజుండు, నజునకు దశరథుండును, పుట్టి; రా దశరథునకు సురప్రార్థితుండై పరబ్రహ్మమయుండైన హరి నాల్గువిధంబులై శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్న నామంబుల నిజాంశ సంభూతుండై జన్మించె; తచ్చరిత్రంబు వాల్మీకి ప్రముఖులైన మునులచేత వర్ణితంబైనది; యైననుం జెప్పెద సావధానమనస్కుండవై యాకర్ణింపుము.

టీక:- అట్టి = అటువంటి; ఖట్వాంగున్ = ఖట్వాంగుని; కున్ = కి; దీర్ఘబాహుండు = దీర్ఘబాహుడు; దీర్ఘబాహున్ = దీర్ఘబాహుని; కున్ = కి; రఘువు = రఘువు; రఘువున్ = రఘువున; కున్ = కు; పృథుశ్రవణుండున్ = పృథుశ్రవణుడు; పృథుశ్రవణున్ = పృథుశ్రవణుని; కున్ = కి; అజుండును = అజుడు; అజున్ = అజుని; కున్ = కి; దశరథుండును = దశరథుడు; పుట్టిరి = జన్మించిరి; ఆ = ఆ; దశరథున్ = దశరథుని; కున్ = కి; సుర = దేవతలచే; ప్రార్థితుండు = వేడబడినవాడు; ఐ = అయ్యి; పరబ్రహ్మమయుండు = పరబ్రహ్మస్వరూపము; ఐన = అయిన; హరి = నారయణుడు; నాల్గు = నాలుగు (4); విధంబులున్ = రకములుగ; ఐ = అయ్యి; శ్రీరామ = శ్రీరాముడు; లక్ష్మణ = లక్ష్మణుడు; భరత = భరతుడు; శత్రుఘ్న = శత్రుఘ్నుడు; నామంబులన్ = అనెడి పేర్లతో; నిజ = తనయొక్క; అంశ = అంశతో; సంభూతుండ = అవతరించినవాడు; ఐ = అయ్యి; జన్మించె = పుట్టెను; తత్ = వారి; చరిత్రంబున్ = కథను; వాల్మీకి = వాల్మీకుడు; ప్రముఖులు = మొదలగుముఖ్యులు; ఐన = అయిన; మునుల్ = ఋషుల; చేత = వలన; వర్ణితంబు = వివరింపబడినది; ఐనను = అయినప్పటికి; చెప్పెదన్ = చెప్పెదను; సావధానుండవు = సావధానుండవు; ఐ = అయ్యి; ఆకర్ణింపుము = వినుముా.

భావము:- ఆ ఖట్వాంగుడికి దీర్ఘబాహుడు, దీర్ఘబాహునికి రఘువు, రఘువుకు పృథుశ్రవణుడు, పృథుశ్రవణునికి అజుడు, అజునికి దశరథుడు జన్మించారు. దేవతలు వేడగా పరబ్రహ్మ స్వరూపుడు నారయణుడు నాలుగు (4) రకాలుగ అయ్యి, ఆ దశరథునికి శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు అనే పేర్లతో తన అంశతో అవతరించి పుట్టాడు. వారి కథను వాల్మీకి మున్నగు మహర్షుల వలన వివరింపబడింది. ఆ ఇతిహాసాన్ని చెప్తాను శ్రద్ధగా విను.

★9-259-మ.

అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుండై నట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధ రావణశిరస్సంఘాతసంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డా గరితకుం గౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్య కతుల్య కంచితజనుస్సంసారసాఫల్యకున్.

టీక:- అమరేంద్రాశ = తూర్పుదిక్కున {అమరేంద్రాశ - అమరేంద్రుని (ఇంద్రుని) ఆశ (దిక్కు), తూర్పు}; కున్ = కు; పూర్ణచంద్రుడు = నిండుచంద్రుడు; ఉదితము = ఉదయించినవాడు; ఐన = అయిన; అట్లు = విధముగ; నారాయణ = విష్ణుమూర్తి; అంశమునన్ = అంశతో; పుట్టె = జన్మించెను; మద = గర్వము అనెడి; అంధ = గుడ్డితనము కల; రావణ = రావణుని; శిరస్ = తలలు; సంఘాత = సమూహమునను; ఛేదన = ఖండించెడి; క్రమణ = విధమునందు; ఉద్దాముడు = ఆరితేరినవాడు; రాముడు = శ్రీరాముడు; గరిత = పతివ్రత; కున్ = కు; కౌసల్య = కౌసల్యాదేవి; కున్ = కి; సన్నుత = స్తుతింపబడెడి; అసమత = సాటిలేని; నైర్మల్య = పరిశుద్ధురాలు; కు = కు; అతుల్య = సాటిలేని; అంచిత = పూజనీయమైన; జనుః = పుట్టువా; సంసారసాఫల్య = సంసారమును దాటుట యందు సఫలత్వములూ పొందినామె; కున్ = కి

భావము:- కౌసల్యాదేవి సాటిలేని పూజనీయ పుట్టుక సంసారసాఫల్యత పొందిన మిక్కిలి పరిశుద్ధురాలైన సాధ్వి. తూర్పుదిక్కున నిండుచంద్రుడు ఉదయించినట్లు, ఆమె యందు విష్ణుమూర్తి తన అంశతో గర్వాంధుడైన రావణుని తలలు నరకుటలో ఆరితేరిన శ్రీరామచంద్రమూర్తిగా అవతరించాడు.

9-260-మ.

సవరక్షార్థము దండ్రి పంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడరా
నవలీలం దునుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవిసంపజ్జితహాటకం గపటభాషావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకం గరవిరాజత్ఖేటకం దాటకన్.

టీక:- సవః = యజ్ఞమును; రక్ష = కాపాడెడి; అర్థమున్ = కోసము, కొఱకు; తండ్రి = తండ్రి; పంపన్ = పంపించగా; విశ్వామిత్రుడున్ = విశ్వామిత్రుడు; తోడన్ = కూడ; రాన్ = వస్తుండగ; అవలీలన్ = అతిసులువుగా; తునుమాడెన్ = సంహరించెను; రాముడు = రాముడు; అదయుండు = దయచూపనివాడు; ఐ = అయ్యి; బాలుడు = చిన్నపిల్లవానిగా; ఐ = ఉండి; కుంతల = శిరోజముల; ఛవిన్ = కాంతుల; సంపత్ = సంపదలతో; జిత = జయింపబడిన; హాటకన్ = బంగారముకలదానిని; కపట = మాయ; భాషా = మాటలుపలుకుటలో; విస్ఫురిత్ = తెలియవచ్చు; నాటకన్ = నాటకములుకలదానిని; జవన్ = వేగములో;

భిన్న = ఓడింపబడిన; అర్యమ = సూర్యరథముయొక్క; ఘోటకన్ = గుఱ్ఱములు కలదానిని; కర = చేతిలో; విరాజత్ = ప్రకాశించెడి; ఖేటకన్ = డాలుకలదానిని; తాటకన్ = తాటకిని.

భావము:– చిన్నపిల్లవాడుగా ఉండగా శ్రీరాముడిని తండ్రి యజ్ఞం కాపాడటానికి మహర్షి విశ్వామిత్రుని వెంట పంపించాడు. అక్కడ ఉన్న రాకాసి తాటకి బంగారు రంగు జుట్టు కలది, కపట పలుకులతో నాటకాలు ఆడేది, సూర్యుని గుఱ్ఱాలను మించిన వేగం కలది. చేతిలో గొప్పడాలు కలది. అలాంటి తాటకిపై ఏమాత్రం దయ చూపకుండా శ్రీరాముడు దానిని సులువుగా సంహరించాడు.

## 9-261-క.

గారామునఁ గౌశిక మఖ
మా రాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్
ఘోరాజిఁ ద్రుంచి తోలెన్
మారీచున్ నీచుఁ గపటమంజులరోచున్.

టీక:– గారామునన్ = గొప్పగా; కౌశిక = కౌశికుని; మఖమున్ = యాగమును; ఆ = ఆ; రాముడు = శ్రీరాముడు; కాచి = కాపాడి; దైత్యున్ = రాక్షసుని; అధికున్ = గొప్పవానిని; సుబాహున్ = సుబాహుని; ఘోర = భయంకరమైన; ఆజిన్ = యుద్ధమునందు; త్రుంచి = చంపి; తోలెన్ = తరిమికొట్టి; మారీచున్ = మారీచుని; నీచున్ = దుర్మార్గుని; కపట = మోసపూరిత; మంజుల = మనోజ్ఞమైన (బంగారులేడి); రోచున్ = రూపముధరించినవానిని.

భావము:– శ్రీరాముడు భీకర యుద్ధంచేసి రాక్షసుడైన సుబాహుని చంపాడు. కపటవేషం వేసిన దుర్మార్గుడు మారీచుని తరిమికొట్టాడు. కౌశికుడు అను మరొక పేరు గల విశ్వామిత్రుని యాగాన్ని కాపాడాడు.

## 9-262-మ.

ఒక మున్నూఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు బా
లకరీంద్రంబు సులీలమైఁ జెఱకుఁగోలం ద్రుంచు చందంబునన్
సకలోర్వీశులు చూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహక్షమా
పక గేహంబున సీతకై గుణమణిప్రస్ఫీతకై లీలతోన్.

టీక:– ఒక = ఒక; మున్నూఱున్ = మూడువందలమంది; కదల్చి = కదలించి; తెచ్చిన = తీసుకువచ్చినట్టి; లలాటోగ్రాక్షుచాపంబున్ = శివధనుస్సును {లలాటోగ్రాక్షుచాపము – లలాట (నుదుట) ఉగ్ర (భయంకరమైన) అక్షున్ (కన్నుగలవాని) (శివుని) చాపము (విల్లు), శివధనుస్సు}; బాలకరీంద్రంబు =

గున్న ఏనుగు; సులీలమై = అవలీలగా; చెఱకు = చెరుకు; కోలన్ = గడను; త్రుంచు = విరిచెడి; చందంబునన్ = విధముగ; సకల = అందరు; ఉర్వీశులున్ = రాజులు {ఉర్వీశుడు – ఉర్వి (భూమి)కి ఈశుడు, రాజు}; చూడగాన్ = చూస్తుండగా; విఱిచెన్ = విరిచేసెను; దోః = భుజ; శక్తిన్ = బలముతో; విదేహ = విదేహ అనెడి; క్షమాపక = రాజుయొక్క {క్షమాపకుడు – క్షమ (భూమి)కి అపకుడు (తండ్రి), రాజు}; గేహంబునన్ = నివాసమునందు; సీత = సీతాదేవి; కై = కోసము; గుణ = సుగుణములనెడి; మణి = రత్నములు; ప్రస్ఫీత = మిక్కిలి స్వచ్ఛమైనామె; కై = కోసము; లీలతోన్ = సుళువు; తోన్ = తోటి.

భావము:– సుగుణాల ప్రోవు సీతాదేవి కోసం, ఆమె తండ్రి విదేహరాజు జనకుని ఇంట, రాజలోకం అందరు చూస్తుండగా, మూడువందల మంది కదలించి తీసుకువచ్చిన శివధనుస్సును, గున్న ఏనుగు అవలీలగా చెరుకు గడను విరిచినట్లు అతి సుళువుగా విరిచేసాడు.

★9-263-క.

భూతలనాథుఁడు రాముఁడు
ప్రీతుండై పెండ్లియాడెఁ బృథుగుణమణి సం
ఘాతన్ భాగ్యోపేతన్
సీతన్ ముఖకాంతివిజిత సితఖద్యోతన్.

టీక:– భూతలనాథుడు = లోకనాయకుడు; రాముడు = రాముడు; ప్రీతుండు = ఇష్టపడినవాడు; ఐ = అయ్యి; పెండ్లియాడెన్ = వివాహముచేసుకొనెను; పృథు = గొప్ప; గుణ = సుగుణము లనెడి; మణి = మణుల; సంఘాతన్ = కలిగినామెను; భాగ్య = అదృష్టములు; ఉపేతన్ = కూడుకొన్నామెను; సీతన్ = సీతాదేవిని; ముఖ = మోము యొక్క; కాంతిన్ = ప్రకాశముచేత; విజిత = జయింపబడిన; సిత = తెల్లని; ఖద్యోతన్ = సూర్యకాంతి గలామెను {ఖద్యోతుడు – ఖత్ (ఆకాశమున) జ్యోతము (ప్రకాశించునది), సూర్యుడు}.

భావము:– లోకనాయకుడు అయిన శ్రీరాముడు గొప్ప గుణవంతురాలు, అదృష్టవంతురాలు మఱియు చంద్రుని మించిన కాంతివంతమైన ముఖము కలిగిన సీతాదేవిని ప్రీతితో పెళ్ళిచేసుకొన్నాడు

9-264-క.

రాముఁడు నిజబాహుబల
స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠారో
ద్దామున్ విదళీకృతనృప
భామున్ రణరంగభీము భార్గవరామున్.

టీక:– రాముడు = రాముడు; నిజ = తనయొక్క; బాహు = భుజ; బల = బలముయొక్క; స్థేమంబునన్ = సామర్థ్యమువలన; భంగపరిచెన్ = భంగపరచెను; దీర్ఘ = పెద్ద; కుఠార = గొడ్డలితో; ఉద్దామున్ = గండరగండడుని; విదళీకృత = పటాపంచలుచేసిన; నృప = రాజుల; భామున్ = రోషము కల వానిని; రణరంగ = యుద్ధభూమియందు; భీమున్ = భయంకరమైనవానిని; భార్గవరామున్ = పరశురాముడిని {భార్గవరాముడు – భార్గవుని యొక్క రాముడు, భృగుమహర్షి వంశములో పుట్టిన రాముడు, పరశురాముడు}.

భావము:– శ్రీరాముడు తన భుజబలాతిశయంతో; గొడ్డలి ఆయుధం పట్టే గండరగండడిని, రాజలోకం అందరి రోషం పటాపంచలు చేసిన వాడిని, భీకరమైన యుద్ధం చేసేవాడిని, పరశురాముడిని భంగపరచాడు.

9–265–క.

దశరథుఁడు మున్ను గైకకు
వశుఁడై తానిచ్చి నట్టి వరము కతన వా
గ్దశ చెడక యడివి కనిచెను
దశముఖముఖకమలతుహినధామున్ రామున్.

టీక:– దశరథుడు = దశరథుడు; మున్నున్ = ఇంతకుముందు; కైక = కైక; కున్ = కు; వశుడు = అనుకూలుడు; ఐ = అయ్యి; తాన్ = అతను; ఇచ్చిన = ఇచ్చిన; అట్టి = అటువంటి; వరమున్ = వరముల; కతనన్ = వలన; వాగ్దశన్ = వాగ్దత్తమును; చెడక = తప్పక; అడవి = అరణ్యమున; కిన్ = కు; అనిచెను = పంపించెను; దశముఖ = రావణుని {దశముఖుడు – పదిముఖములు కలవాడు, రావణుడు}; ముఖ = ముఖము అనెడి; కమల = కమలములకు; తుహినధామున్ = చంద్రునివంటివానిని {తుహినధాముడు – తుహిన (మంచువంటి చల్లదనమునకు) ధాముడు (నివాసమైనవాడు), చంద్రుడు}; రామున్ = రాముడిని.

భావము:– దశరథుడు ఇంతకు ముందు తాను కైకకు ఇచ్చిన వరాలకు కట్టుబడి రావణుని ముఖ కమలాలకు చంద్రునివంటి వాడైన శ్రీరాముడిని అడవికి పంపించాడు.

★9–266–క.

జనకుఁడు పనిచిన మేలని
జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్
జనపతి రాముఁడు విడిచెను
జనపాలారాధ్యదసాధ్య నయోధ్యన్.

టీక:– జనకుడు = తండ్రి; పనిచిన = పంపించగా; మేలు = మంచిది; అని = అని; జనకజయును = సీతాదేవి {జనకజ – జనకునికి పుట్టినామె, సీత}; లక్ష్మణుండు = లక్ష్మణుడు; సంసేవింపన్ = చక్కగాసేవిస్తుండగా; జనపతి = రాజైన; రాముడు = రాముడు; విడిచెన్ = వదిలిపెట్టెను; జనపాల = రాజులచే; ఆరాధ్య = పూజింపబడెడిది; ద్విషద్ = శత్రువులకు; అసాధ్యన్ = సాధింపరానిది ఐన; అయోధ్యన్ = అయోధ్యను.

భావము:– అయోధ్య రాజులచే పూజనీయమైనది. శత్రువులకు సాధింపరానిది. అట్టి అయోధ్యను తండ్రి ఆజ్ఞను శిరసావహించి సీతాదేవి, లక్ష్మణుడు తనను సేవిస్తుండగా శ్రీరాముడు వదిలి పెట్టెను.

9–267–క.

భరతున్ నిజపదసేవా
నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్
సురుచిర రుచి పరిభావిత
గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్.

టీక:– భరతున్ = భరతుడిని; నిజపాద = తనపాదములను; సేవా = సేవించుటయందు; నిరతున్ = భక్తిగలవానిని; రాజ్యమునన్ = రాజ్యమునందు; ఉనిచి = నియమించి; నృప = రాజులలో; మణి = ఉత్తముడు; ఎక్కెన్ = అధిరోహించెను; సురుచిర = మంచి రమణీయమైన; రుచి = కాంతులతో; పరిభావిత = ధిక్కరించిన; గురు = గొప్ప; గోత్రాచలమున్ = కులపర్వతములుగల; చిత్రకూటమున్ = చిత్రకూటపర్వతమును.

భావము:– తన పాదాసేవానురక్తుడైన భరతుడిని రాజ్య పాలన యందు నియమించాడు. పిమ్మట, కులపర్వతాలను మించిన రమణీయమైన కాంతులు గల చిత్రకూటపర్వతాన్ని రాజశేఖరుడు శ్రీరాముడు ఎక్కాడు.

9–268–ఉ.

పుణ్యుఁడు రామచంద్రుఁ డట పోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ దాపసోత్తమ శరణ్యము నుద్ధత బర్హి బర్హ లా
వణ్యము గౌతమీ విమల వాఃకణ పర్యటనప్రభూత సా
ద్గుణ్యము నుల్లసత్తరు నికుంజ వరేణ్యము నగ్రగణ్యమున్.

టీక:– పుణ్యుడు = పుణ్యాత్ముడు; రామచంద్రుడు = రాముడనెడి చల్లనివాడు; అట = అక్కడ; పోయి =

వెళ్ళి; ముదంబునన్ = సంతోషముతో; కాంచెన్ = దర్శించెను; దండకారణ్యమున్ = దండకారణ్యమును; తాపస = ఋషులలో; ఉత్తమ = శ్రేష్ఠులకు; శరణ్యమున్ = అండనిచ్చెడిది; ఉద్ధతన్ = గర్వించిన; బర్హి = ఆడనెమలి; బర్హ = మగనెమలుతో; లావణ్యమును = మనోజ్ఞమైనది; గౌతమీ = గోదావరీ; విమల = స్వచ్ఛమైన; వాఃకణ = నీటిబిందువుల; పర్యటన = వ్యాప్తులచేత; ప్రభూత = అతిశయించి; సాద్గుణ్యమున్ = సద్గుణసంపత్తిగలది; ఉల్లసత్ = ప్రకాశించుచున్న; తరు = చెట్లు; నికుంజ = పొదలచే; వరేణ్యమున్ = ఉత్తమమైనదానిని; అగ్రగణ్యమున్ = గొప్పగ ఎంచదగినదానిని.

భావము:– పుణ్యాత్ముడైన శ్రీరామచంద్రుడు అలా వెళ్ళి ఋషీశ్వరుల సమాశ్రయము, పురివిప్పి ఆడే నెమళ్ళతో మనోజ్ఞమైనది, పవిత్ర గోదావరీ జలాలతో విలసిల్లేది, గొప్ప చెట్లు పొదలతో కూడినది ఐన విశిష్టమైన దండకారణ్యాన్ని సంతోషముతో దర్శించాడు.

9–269–సీ.

ఆ వనంబున రాముఁ డనుజ సమేతుడై–
సతితోడ నొక పర్ణశాల నుండ
రావణు చెల్లలు రతిఁ గోరి వచ్చిన–
మొగి లక్ష్మణుఁడు దాని ముక్కు గోయ
నది విని ఖరదూషణాదులు పదునాల్గు–
వేలు వచ్చిన రామవిభుఁడు గలన
బాణానలంబున భస్మంబు గావింప–
జనకనందన మేని చక్కఁదనము

9–269.1–తే.

విని దశగ్రీవుఁ డంగజ వివశుఁ డగుచు
నర్థిఁ బంచినఁ బసిఁడిఱ్ఱి యై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె
నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు.

టీక:– ఆ = ఆ; వనంబునన్ = అడవియందు; రాముడు = శ్రీరాముడు; అనుజ = తమ్మునితో; సమేతుడు = కలిసి ఉన్నవాడు; ఐ = అయ్యి; సతి = భార్య; తోడన్ = తోటి; ఒక = ఒకానొక; పర్ణశాలన్ = పర్ణశాలయందు; ఉండన్ = ఉండగా; రావణు = రావణాసురుని; చెల్లెలు = చెల్లెలు; రతిన్ = మన్మథక్రీడను; కోరి = కావాలని; వచ్చినన్ = రాగా; మొగి = పూని; లక్ష్మణుడు = లక్ష్మణుడు; దాని = దానియొక్క; ముక్కున్ =

నాసికను; కోయన్ = కోసివేయగా; అది = దానిని; విని = విని; ఖర = ఖరుడు; దూషణ = దూషణుడు; ఆదులు = మున్నగువారు; పదునాల్గువేలు = పద్నాలుగువేలమంది; వచ్చినన్ = రాగా; రామవిభుడు = శ్రీరామప్రభువు; కలనన్ = యుద్ధభూమియందు; బాణ = బాణములుఅనెడి; అనలంబునన్ = అగ్నిలో; భస్మంబున్ = బూడిద; కావింపన్ = చేయగా; జనకనందన = సీత {జనకనందన – జనకుని పుత్రిక, సీత}; మేని = శరీర; చక్కదనమున్ = లావణ్యమును;

; విని = విని; దశగ్రీవుడు = రావణుడు {దశగ్రీవుడు – దశ (పది) గ్రీవుడు (కంఠములు కలవాడు), రావణుడు}; అంగజ = మన్మథునివలన {అంగజుడు – అంగము (దేహము)నందు పుట్టువాడు, ఇంద్రియములందు పుట్టెడివాడు, మన్మథుడు}; వివశుడు = వశముతప్పినవాడు; అగుచున్ = ఐపోతూ; అర్థిన్ = కోరి; పంచినన్ = పంపించగా; పసిడి = బంగారు; ఇఱ్ఱి = లేడి; ఐ = అయ్యి; నటించు = నటిస్తున్నట్టి; నీచున్ = నీచుని; మారీచున్ = మారీచుని; రాముడు = రాముడు; నెఱిన్ = పరాక్రమముతో; వధించెన్ = సంహరించెను; అంతలోన్ = ఆలోపల; సీతన్ = సీతను; కొనిపోయెను = తీసుకుపోయెను; అసురవిభుడు = రాక్షసరాజు.

భావము:– శ్రీరాముడు తమ్ముడితో భార్యతో కలిసి దండకారణ్యంలో ఒక పర్ణశాలలో ఉన్నాడు. అప్పుడు రావణాసురుని చెల్లెలు శూర్పణఖ కామించి వచ్చింది. అంతట లక్ష్మణుడు ఆమె ముక్కు కోసెను. అది విని ఖరుడు దూషణుడు అనే రాక్షసులు పద్నాలుగువేల మంది రాక్షససేనతో దండెత్తి వచ్చారు. శ్రీరామచంద్రుడు యుద్ధంచేసి తన బాణాగ్నిలో వారిని భస్మం చేసాడు. సీత చక్కదనం విని మన్మథ పరవశుడైన రావణుడు మారీచుడిని పంపాడు. ఆ నీచుడు బంగారు లేడి రూపంలో రాగా, శ్రీరాముడు వానిని వధించెను. ఆ సమయంలో రావణాసురుడు సీతను తీసుకుపోయెను.

## 9-270-ఉ.

ఆ యసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము చేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైన ఘో
రాయతహేతిఁ ద్రుంచె నసహాయత రామనరేంద్రకార్యద
త్తాయువుఁ బక్షవేగపరిహాసితవాయువు నజ్జటాయువున్.

టీక:– ఆ = ఆ; అసురేశ్వరుండు = రాక్షసరాజు; వడిన్ = వేగముగా; అంబర = ఆకాశ; వీథిన్ = మార్గమున; ఇలాతనూజన్ = సీతను {ఇలాతనూజ – భూమియందు జనించినామె, సీత}; అన్యాయము = మోసము; చేసి = చేసి; నిష్కరుణుడు = దయమాలినవాడు; ఐ = అయ్యి; కొనిపోవన్ = తీసుకుపోతుండగ; అడ్డమైన = అడ్డమురాగా; ఘోర = భయంకరమైన; ఆయత = పెద్ద; హేతిన్ = ఆయుధముతో; త్రుంచెన్ = సంహరించెను; అసహాయత = నిస్సహాయురాలిని; రామ = రాముడు అనెడి; నరేంద్ర = రాజుయొక్క; కార్య = పనియందు; దత్త = ఇచ్చివేసిన; ఆయువున్ = ఆయుష్షుకలదానిని; పక్ష = రెక్కల; వేగ = వేగముచేత; పరిహాసిత = మించిన; వాయువున్ = వాయువుకలదానిని; జటాయువున్ = జటాయువును.

భావము:- దయావిహీనుడైన రాక్షసరాజు అలా మోసం చేసి వేగంగా ఆకాశ మార్గాన సీతను తీసుకుపోతుంటే, రామకార్యం కోసం ఆయుస్సు త్యాగంచేసినది, వాయువేగాన్ని మించిన వేగం గలది అయిన జటాయువు అడ్డగించింది. నిస్సహాయురాలైన ఆ జటాయువును భయంకరమైన పెద్ద ఆయుధంతో రావణుడు సంహరించాడు.

9-271-వ.

అంతనా రామచంద్రుండు లక్ష్మణసహితుండై, సీత వెదక నరుదెంచి, నిజకార్యనిహతుండైన జటాయువునకుఁ పరలోకక్రియలు గావించి, ఋశ్యమూకంబునకుం జని.

టీక:- అంతన్ = అప్పుడు; ఆ = ఆ; రామచంద్రుండు = రామచంద్రుడు; లక్ష్మణ = లక్ష్మణునితో; సహితుండు = కూడినవాడు; ఐ = అయ్యి; సీతన్ = సీతను; వెదకన్ = అన్వేషించుటకై; అరుదెంచి = వచ్చి; నిజ = తన; కార్య = పనియందు; నిహతుండు = మరణించినవాడు; ఐన = అయిన; జటాయువున్ = జటాయువున; కున్ = కు; పరలోకక్రియలు = అంత్యక్రియలు; కావించి = చేసి; ఋశ్యమూకంబునన్ = ఋశ్యమూకపర్వతమున; కున్ = కు; చని = వెళ్ళి.

భావము:- అప్పుడు, సీతాన్వేషణకై వచ్చిన రామలక్ష్మణులు, రామకార్యంలో ప్రాణాలు త్యజించిన ఆ జటాయువునకు, అంత్యక్రియలు చేసి, ఋశ్యమూకపర్వతానికి వెళ్ళారు.

★9-272-క.

"నిగ్రహము నీకు వల దిఁక
నగ్రజు వాలిన్ వధింతు" నని నియమముతో
నగ్రేసరుఁగా నేలెను
సుగ్రీవుం జరణఘాతచూర్ణగ్రావున్.

టీక:- నిగ్రహము = బెదురు, చెర; నీ = నీ; కున్ = కు; వలదు = వద్దు; ఇకన్ = ఇకపైన; అగ్రజున్ = అన్నను; వాలిన్ = వాలిని; వధింతును = సంహరించెదను; అని = అని; నియమము = ప్రతిజ్ఞ; తోన్ = తోటి; అగ్రేసరుగాన్ = ప్రభువుగా; ఏలెను = పాలించెను; సుగ్రీవున్ = సుగ్రీవుని; చరణ = కాలి; ఘాత = దెబ్బతో; చూర్ణ = పిండిచేయబడిన; గ్రావున్ = బండరాళ్ళు కలవానిని.

భావము:- ఒక్క తన్నుతోనే బండరాళ్ళను పిండిపిండి చేయగల మహా బలశాలి సుగ్రీవుడికి, “ఇకపైన నీకు ఈ నిర్బంధం అక్కరలేదు, మీ అన్న వాలిని సంహరిస్తాను” అని అభయం ఇచ్చి, శ్రీరామచంద్ర ప్రభువు పాలించాడు.

★9-273-క.

లీలన్ రామవిభుం డొక

కోలం గూలంగ నేసె గురు నయశాలిన్

శీలిన్ సేవితశూలిన్

మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మాలిన్.

టీక:- లీలన్ = క్రీడగా; రామవిభుండు = శ్రీరామప్రభువు; ఒక = ఒకే ఒక; కోలన్ = బాణముతో; కూలంగన్ = పడిపోవునట్లు; ఏసెన్ = కొట్టెను; గురు = గొప్ప; నయశాలిన్ = నీతిమంతుని; శీలిన్ = మంచిశీలముకలవానిని; సేవిత = పూజింపడిన; శూలిన్ = పరమశివుడు కలవానిని; మాలిన్ = మాలధరించినవానిని {మాలి - 1. మాలలు ధరించిన వాడు, కృష్ణుడు, 2. ఇంద్రుడొసగిన మాల కంఠమున ధరించినవాడు, వాలి}; వాలిన్ = వాలిని; దశాస్య = రావణుని; మాన = గర్వమును; ఉన్మాలిన్ = హరించినవానిని.

భావము:- గొప్ప నీతిశాలి, పరమశివ భక్తుడు, ఇంద్రుడు ఇచ్చిన మాల ధరించిన వాడిని, రావణుని గర్వాన్ని హరించినవాడు ఐన వాలిని, శ్రీరాముడు ఒకే ఒక బాణంతో కూల్చివేశాడు.

9-274-క.

ఇలమీఁద సీత వెదకఁగ

నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి

చ్చలవంతున్, మతిమంతున్,

బలవంతున్, శౌర్యవంతు, బ్రాభవవంతున్.

టీక:- ఇల = భూమి; మీదన్ = మీద; సీత = సీతజాడ; వెదకగన్ = వెతుకుటకై; అలఘుడు = గొప్పవాడు; రాఘవుడు = శ్రీరాముడు {రాఘవుడు - రఘువంశమున పుట్టినవాడు, రాముడు}; పనిచెన్ = నియోగించెను; హనుమంతున్ = హనుమంతుని; అతి = మిక్కిలి; చలవంతున్ = చురుకైనవానిని, మహామాయావిని; మతిమంతున్ = బుద్ధిమంతుని; బలవంతున్ = బలముగలవానిని; శౌర్యవంతున్ = వీరత్వముగలవానిని; ప్రాభవవంతున్ = మహిమాన్వితుని.

భావము:- గొప్పవాడైన శ్రీరాముడు సీతజాడ వెతకమని మిక్కిలి చురుకైనవాడు, మహామహిమాన్వితుడు, గొప్ప బుద్ధిమంతుడు, మిక్కిలి బలశాలి, మహా వీరుడు అయిన హనుమంతుని నియోగించాడు.

★9-275-క.

అలవాటు కలిమి మారుతి
లలితామిత లాఘవమున లంఘించెను శై
వలినీగణసంబంధిన్
జలపూరిత ధరణి గగన సంధిం గంధిన్.

టీక:- అలవాటు = అభ్యాసము {అలవాటుకలిమి - హనుమంతుడు బాలునిగా గెంతి సూర్యుని మింగబోయాడు కదా ఆ అలవాటు వలన సముద్రలంఘనం సుళువుగా దాటాడట.}; కలిమిన్ = ఉండుటచేత; మారుతి = హనుమంతుడు {మారుతి - వాయుపుత్రుడు, హనుమంతుడు, భీముడు}; లలిత = సున్నితమైన; అమిత = అత్యధికమైన; లాఘవమునన్ = నేర్పుతో; లంఘించెను = దాటెను; శైవలినీ = `నదుల {శైవలిని - నాచుగలది, నది}; గణ = సమూహమునకు; సంబంధిన్ = బంధువైనదానిని; జల = నీటితో; పూరిత = నిండియుండి; ధరణి = భూమిని; గగన = ఆకాశమును; సంధిన్ = కలుపుదానిని; కంధిన్ = సముద్రమును {కంధి - కం (నీటికి) నిధి, కడలి.}.

భావము:- బాలునిగా సూర్యుని వరకు గెంతి మింగబోయిన అలవాటు ఉండడంతో మారుతి నదులు అన్నింటికీ బంధువు, భూమికి ఆకాశానికి వ్యవధానం, నీటితో నిండి ఉండేది అయిన సముద్రాన్ని మిక్కిలి లాఘవంగా దాటాడు.

9-276-వ.

ఇట్లు సముద్రంబు దాఁటి సీతం గని, హనుమంతుండు దిరిగి చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి.

టీక:- ఇట్లు = ఈ విధముగ; సముద్రంబున్ = సముద్రమును; దాటి = దాటి; సీతన్ = సీతను; కని = కనుగొని; హనుమంతుండు = హనుమంతుడు; తిరిగి = వెనుకకు; చనుదెంచుచున్ = వచ్చుచు; అక్షకమార = అక్షకుమారుడు; ఆదులన్ = మున్నుగువారిని; వధియించి = సంహరించి.

భావము:- ఈ విధంగ సముద్రాన్ని దాటి సీతను కనుగొని హనుమంతుడు వెనుకకు వస్తూ అక్షకుమారుడు మున్నగు రాక్షసులను సంహరించాడు.

9-277-క.

సముదగ్రత ననిలసుతుం

డమరాహిత దత్త వాల హస్తాగ్నుల భ

స్మము చేసె నిరాతంకన్

సముదాసురసుభటవిగతశంకన్ లంకన్.

టీక:- సముద = మిక్కిలి; అగ్రతన్ = గొప్పదనముతోటి; అనిలసుతుండు = హనుమంతుడు {అనిలసుతుడు - వాయుపుత్రుడు, హనుమ}; అమరాహిత = రాక్షసులచే {అమరాహితులు - అమరుల (దేవతల) అహితులు, రాక్షసులు}; దత్త = పెట్టబడిన; వాల = తోక; హస్త = ముందుభాగపు; అగ్నులన్ = మంటలతో; భస్మముచేసెన్ = కాల్చివేసెను; నిరాతంకన్ = వెఱపు లేని దానిని (నిర్ + ఆతంకన్); సమద = మదించిన; అసుర = రాక్షసులైన; సుభట = గట్టిసైనికులచే; విగత = పోగొట్టబడిన; శంకన్ = బెదురుగలదానిని; లంకన్ = లంకానగరమును.

భావము:- మిక్కిలి గొప్పదనంతో వాయుపుత్రు డైన హనుమంతుడి తోక రాక్షసులు అంటించారు. ఆ తోక మంటలతోనే గట్టి రాక్షస సైనికుల రక్షణలో ఉన్న ఆ లంకానగరాన్ని హనుమంతుడు కాల్చివేసాడు.

9-278-వ.

ఇట్లు లంకాదహనంబు చేసివచ్చి వాయుజుండు సీతకథనంబు చెప్పిన విని రామచంద్రుండు వనచరనాథ యూథంబులుం దానును చనిచని.

టీక:- ఇట్లు = ఈ విధముగ; లంకాదహనంబున్ = లంకనుకాల్చుట; చేసి = చేసి; వచ్చి = వెనుకకువచ్చి; వాయుజుండు = హనుమంతుడు {వాయుజుండు - వాయుపుత్రుడు, హనుమంతుడు}; సీత = సీత; కథనంబున్ = వృత్తాంతమును; చెప్పినన్ = చెప్పగా; విని = విని; రామచంద్రుడు = రామచంద్రుడు; వనచర = వానరముల {వనచరము - అడవిలోతిరుగునది, కోతి}; నాథ = నాయకుల; యూథంబులున్ = సైన్యములు; తానున్ = అతను; చనిచని = బయలుదేరివెళ్ళి.

భావము:- ఈ విధంగా లంకను కాల్చి, వెనుకకు వచ్చి హనుమంతుడు సీత వృత్తాంతం చెప్పగా విని, రామచంద్రుడు వానర సైన్యాలతో రావణాసురుడి మీదకు దాడికి బయలుదేరాడు.

9-279-శా.

ఆ రాజేంద్రుఁడు గాంచె భూరివిధరత్నాగారమున్ మీన కుం
భీరగ్రాహకఠోరమున్ విపుల గంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబరపారమున్ లవణపారావారముం జేరువన్.

టీక:- ఆ = ఆ; రాజ = రాజులలో; ఇంద్రుడు = శ్రేష్ఠుడు; కాంచెన్ = చూసెను; భూరివిధ = పెక్కు విధములైన {భూరి - 1. ఒకటి (1) తరువాత 34 సున్నాలు కల సంఖ్య అదే కోటైతే తరువాత ఏడు (7) సున్నాలు. 2. చాలా ఎక్కువ, 3. అత్యధికమైన}; రత్న = రత్నములు; ఆగారమున్ = ఉన్నదానిని; మీన = చేపలు; కుంభీర = నక్రము, మొసలి; గ్రాహ = నీటిపాము, మొసళ్ళతో; కఠోరమున్ = దాటరానిదానిని; విపుల = మిక్కిలి; గంభీరంబున్ = గంభీరమైనది; అభ్ర = ఆకాశమునకు; భ్రమత్ = ఎగిసిపడెడి; ఘోరన్ = భయంకరముగ; అన్యోన్య = పరస్పరము; విభిన్న = ఢీకొనెడి; భంగ = అలల; భవత్ = వలన కలిగిన; నిర్ఘోష = పెద్ద చప్పుడుచేస్తూ; ఛటత్ = చలించెడి; అంభః = నీటి; కణ = తుంపరలతో; ప్రారుద్ధ = లెస్సగా అరికట్టబడిన; అంబర = ఆకాశపు; పారమున్ = అవధులుకలదానిని; లవణ = ఉప్పు; పారావారమున్ = సముద్రమును; చేరువన్ = దగ్గరగా.

భావము:- బహు రత్ననిధిగా ప్రసిద్ధమైనది, భీకరమైన చేపలు, మొసళ్ళు తిమింగలాలతో దాటరానిది, ఆకాశానికి ఎగిసిపడె అలలు కలది, నీటి తుంపరలతో ఆకాశపు అవధులు తాకేది, గంభీరమైన హోరు కలది అయిన ఆ లవణ సముద్రాన్ని దగ్గరగా ఆ రామ రాజశ్రేష్ఠుడు చూసాడు.

9-280-వ.

కని తనకుఁ ద్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు చూపక మిన్నందిన నా రాచపట్టి రెట్టించిన కోపంబున.

టీక:- కని = చూసి; తన = తన; కున్ = కు; త్రోవ = దారి; ఇమ్ము = ఇవ్వవలసినది; అని = అని; వేడినన్ = కోరగా; అదియు = అది; మార్గంబున్ = దారి; చూపక = ఇవ్వకుండ; మిన్నందిననన్ = అతిశయించగా {మిన్నందు - ఆకాసమునకు ఎగసిపడు, గర్వించు}; ఆ = ఆ; రాచపట్టి = రాకుమారుడు; రెట్టించిన = పెరిగిపోయిన; కోపంబునన్ = కోపముతో.

భావము:- అలా సముద్రాన్ని చూసి తనకు దారి ఇవ్వమని కోరాడు. కాని సముద్రుడు దారి ఇవ్వకపోవడంతో, ఆ రాముడి కోపం పెరిగిపోయింది.

9-281-క.

మెల్లని నగవున నయనము
లల్లార్చి శరంబు విల్లు నందిన మాత్రన్
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ
బెల్లలునై జలధి పెద్ద బీడై యుండెన్.

టీక:- మెల్లనినగవునన్ = చిరునవ్వుతో; నయనముల్ = కన్నులు; అల్లార్చి = చలింపజేసి; శరంబున్ = బాణము; విల్లున్ = ధనువు; అందిన = తీసుకొన్న; మాత్రనన్ = మాత్రముచేతనే; గుల్లలున్ = నత్తగుల్లలు; నాచులున్ = నాచులు; చిప్పలు = ఆల్చిప్పలు ఆదులు; పెల్లలున్ = మట్టిపెళ్ళలు; ఐ = కలదిగానయ్యి; జలధి = సముద్రము; పెద్ద = పెద్ద; బీడు = బీడుపడినవిధముగ {బీడు - నిస్సారమైన భూమి, దున్ననిభూమి }; ఉండెన్ = మారిపోయెను.

భావము:- చిరునవ్వుతో కన్నులు చలింపజేసి ధనుర్బాణాలు తీసుకొన్న మాత్రంచేతనే సాగరం ఇగిరిపోయి; నత్తగుల్లలు, నాచులు, ఆల్చిప్పలు, మట్టిపెళ్ళలు బైటపడి బీడుపడినట్లు మారిపోయింది.

9-282-వ.

ఇట్లు విపన్నుండగు సముద్రుండు నదులతోఁ గూడి మూర్తి మంతుండయి చనుదెంచి రామచంద్రుని చరణంబులు శరణంబు జొచ్చి యిట్లని స్తుతియించె.

టీక:- ఇట్లు = ఇలా; విపన్నుండు = ఆపదపాలైనవాడు; అగు = ఐన; సముద్రుండు = సముద్రుడు; నదులు = నదులు; తోన్ = తోటి; కూడి = కలిసి; మూర్తిమంతుడు = రూపుధరించినవాడు; అయి = అయ్యి; చనుదెంచి = వచ్చి; రామచంద్రుని = శ్రీరాముని; చరణంబులున్ = పాదములను; శరణంబుజొచ్చి = శరణువేడి; ఇట్లు = ఈ విధముగ; అని = అని; స్తుతియించె = స్తోత్రముచేసెను.

భావము:- ఇలా ఆపదపాలైన సముద్రుడు నదులతో కలిసి రూపు ధరించి వచ్చి శ్రీరాముని పాదాలను శరణువేడాడు. ఇంకా ఈ విధంగా స్తోత్రం చేసాడు.

9-283-శా.

"ఓ కాకుత్స్థకులేశ! యోగుణనిధీ! యో దీనమందార! నే
నీ కోపంబున కెంతవాఁడ? జడధిన్; నీవేమి భూరాజవే?
లోకాధీశుఁడ; వాదినాయకుఁడ; వీ లోకంబు లెల్లప్పుడున్
నీ కుక్షిం బ్రభవించు; నుండు; నడఁగున్; నిక్కంబు సర్వాత్మకా!

టీక:– ఓ = ఓయీ; కాకుత్స = కాకుత్స్థుని; కుల = వంశమునకుచెందిన; ఈశ = ప్రభువ; ఓ = ఓయీ; గుణ = సుగుణములకు; నిధీ = నిధియైనవాడ; ఓ = ఓయీ; దీన = దీనుల ఎడ; మందార = కల్పవృక్షమువంటివాడ; నేన్ = నేను; నీ = నీయొక్క; కోపంబున్ = కోపమునకు; ఎంతవాడన్ = తట్టుకోలేనివాడను; జడధిన్ = జడత్వముగలవానిని; నీవు = నీవు; ఏమి = ఏమైనా; భూరాజవే = సామాన్యపురాజువా, కాదు; లోక = భువనములకే; అధీశుడవు = విభుడవు; ఆది = మూల; నాయకుడవు = ఈశ్వరుడవు; లోకంబులు = భువనములు; ఎల్లప్పుడును = ఎప్పుడు; నీ = నీయొక్క; కుక్షిన్ = కడుపునందు; ప్రభవించున్ = సృష్టింపబడును; ఉండున్ = మనుచుండును; అడగున్ = లయమగుచుండును; నిక్కంబు = ఇది సత్యము; సర్వాత్మకా = శ్రీరామా {సర్వాత్మకుడు – సమస్తమునందు ఆత్మగ ఉండువాడు – సర్వాంతర్యామి, విష్ణువు}.

భావము:– “ఓయీ! కాకుత్స్థుని వంశ ప్రభువ! ఓ సుగుణనిధీ! ఓ దీనమందార! సర్వాత్మకా! శ్రీరామా! నేను జడస్వభావిని. నీ కోపాన్ని తట్టుకోలేను. నీవు ఏమైనా సామాన్యరాజువా? సకల జగత్తులకు విభుడవు. మూలపూరుషుడవు, ఎల్లప్పుడు నీ కడుపులో సకల భువనాలు సృష్టింపబడుతూ, మనుతూ, లయమవుతూ ఉంటాయి. ఇది సత్యం.

9-284-క.

ధాతల రజమున దేవ
వ్రాతము సత్త్వమున భూతరాశిఁ దమమునన్
జాతులఁగా నొనరించు గు
ణాతీతుఁడ వీవు గుణగణాలంకారా!

టీక:– ధాతలన్ = సృష్టికర్తలను; రజమునన్ = రజోగుణముతోను; దేవ = దేవతల; వ్రాతమున్ = సమూహములను; సత్త్వమునన్ = సత్వగుణముతోను; భూత = జీవ; రాశిన్ = జాలమును; తమమునన్ = తమోగుణముతోను; జాతులన్ = పుట్టినవి; కాన్ = అగునట్లు; ఒనరించు = చేసెడి; గుణా = త్రిగుణములకు; అతీతుడవు = పైనుండువాడవు; ఈవు = నీవు; గుణ = సుగుణముల; గణ = సమూహములకు; అలంకారా = అలంకారమువంటివాడా.

భావము:– సృష్టికర్తలను రజోగుణంతోను, దేవతలను సత్వగుణంతోను జీవజాలాన్ని తమోగుణంతోను పుట్టించే త్రిగుణాలకి అతీతమైన వాడవు. నీవు సకల సుగుణములకే అలంకారం వంటివాడవు.

★9-285-క.

కట్టుము సేతువు; లంకం
జుట్టుము; నీ బాణవహ్ని సురవైరితలల్
గొట్టుము నేలంబడఁ; జే
పట్టుము నీ యబల నధికభాగ్యప్రభలన్.

టీక:- కట్టుము = నిర్మించుము; సేతువున్ = వంతెనను; లంకన్ = లంకానగరమును; చుట్టుము = చుట్టుముట్టుము; నీ = నీయొక్క; బాణ = బాణముల; వహ్నిన్ = అగ్నితో; సురవైరి = రావణుని {సురవైరి - సురల (దేవతల) వైరి (శత్రువు), రాక్షసుడు, కంసుడు, రావణుడు}; తలల్ = తలలను; కొట్టుము = పడగొట్టుము; నేలన్ = నేలమీద; పడన్ = పడిపోవునట్లు; చేపట్టుము = స్వీకరించుము; నీ = నీయొక్క; అబలన్ = స్త్రీని; అధిక = మిక్కిలి; భాగ్య = సౌభాగ్య; ప్రభలన్ = ప్రకాశములతో.

భావము:- ఓ రామా! వంతెన కట్టు, లంకానగరం చుట్టుముట్టు, నీ బాణాగ్నితో రావణుని తలలు నేల రాలగొట్టు, మంగళకరంగా నీ భార్యను స్వీకరించు.

9-288-క.9-286-ఆ.

హరికి మామ నగుదు; నటమీఁద శ్రీదేవి
తండ్రి; నూరకేల తాగడింప?
గట్టఁ గట్టి దాఁటు కమలాప్తకులనాథ!
నీ యశోలతలకు నెలవుగాఁగ"

టీక:- హరి = విష్ణుని; కిన్ = కి; మామన్ = పిల్లనిచ్చినవానిని; అగుదున్ = అవుతాను; అటమీద = ఆపైన; శ్రీదేవి = లక్ష్మీదేవి; తండ్రిన్ = తండ్రిని; ఊరక = అనవసరంగా; ఏల = ఎందుకు; తాగడింపన్ = నిర్బంధించుట, పీడించుట; కట్టన్ = వారధిని; కట్టి = నిర్మించి; దాటు = దాటుము; కమలాప్తకులనాథ = శ్రీరామ {కమలాప్తకులనాథుడు - కమలాప్త (సూర్య) వంశపు రాజు, రాముడు}; నీ = నీయొక్క; యశస్ = కీర్తి అనెడి; లతల = తీగల; కున్ = కు; నెలవు = ఉనికిపట్టు; కాగన్ = అగునట్లు.

భావము:- శ్రీరామ! విష్ణువు అయిన నీ భార్య లక్ష్మీదేవికి నేను తండ్రిని, అలాగ నీకు పిల్లనిచ్చిన మామను. అనవసరంగా నన్ను నిర్బంధించడం, పీడించడం ఎందుకు. నీ కీర్తి తీగలు సాగేలా వారధి నిర్మించి దాటుము.

9-287-వ.

అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వప్రకారంబున నుండు పొమ్మని వీడుకొల్పె; నంత.

టీక:- అని = అని; విన్నవించినన్ = మనవిచేసుకొనగా; రామచంద్రుండు = శ్రీరాముడు; సముద్రునిన్ = సముద్రుడిని; పూర్వ = ఇదివరకు; ప్రకారంబునన్ = లాగనె, విధముగనె; ఉండు = ఉండుము; పొమ్ము = ఇక వెళ్ళుము; అని = అని; వీడుకొల్పెను = పంపివేసెను; అంత = అప్పుడు.

భావము:- అని సముద్రుడు మనవి చేసుకొనగా శ్రీరాముడు "ఇక వెళ్ళు ఇదివరకు లాగే ఉండు" అని పంపించాడు. అప్పుడు

9-288-క..

ఘన శైలంబులుఁ దరువులు
ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్
ఘనజలరాశిం గట్టిరి
ఘనవాహప్రముఖదివిజగణము నుతింపన్.

టీక:- ఘన = పెద్ద; శైలంబులున్ = కొండరాళ్ళు; తరువులు = వృక్షములు; ఘన = మిక్కిలి; జవమునన్ = వేగముగా; పెఱికి = పెకిలించి; తెచ్చి = తీసుకొని వచ్చి; కపి = వానర; కుల = జాతి; నాథుల్ = నాయకులు; ఘనజలరాశిన్ = సముద్రముపైన; కట్టిరి = నిర్మించిరి; ఘనవాహ = ఇంద్రుడు {ఘనవాహుడు – ఘన (మేఘము)లపై వాహ (విహరించువాడు), ఇంద్రుడు}; ప్రముఖ = మున్నగు; దివిజ = దేవతా; గణము = సమూహము; నుతింపన్ = స్తుతించగా.

భావము:- శీఘ్రమే పెద్ద కొండరాళ్ళు, వృక్షాలు పెకిలించి తీసుకొని వచ్చి వానర జాతి నాయకులు సముద్రము మీద వారధి నిర్మించారు. ఇంద్రాది దేవతలు అందరూ స్తుతించారు.

9-289-వ.

ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణు తమ్ముం డైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చి; కూడుకొని లంకకుఁ జని విడిసి వేడెపెట్టించి లగ్గలుపట్టించిన.

టీక:- ఇట్లు = ఈ విధముగ; సముద్రంబున్ = సముద్రమును; దాటి = తరించి; రామచంద్రుండు = శ్రీరాముడు; రావణు = రావణుని; తమ్ముండు = తమ్ముడు; ఐన = అయినట్టి; విభీషణుండు = విభీషణుడు;

శరణంబు = అండ; వేడినన్ = కోరగా; అభయంబున్ = అభయమును; ఇచ్చి = ఇచ్చి; కూడుకొని = కలుపుకొని; లంక = లంకానగరమున; కున్ = కు; చని = వెళ్ళి; విడిసి = విడిది ఏర్పరచుకొని; వేడెపెట్టించి = చుట్టుముట్టి; లగ్గలుపట్టించిన = ముట్టడించి కోటలెక్కించిన.

భావము:– ఈ విధంగ సముద్రం దాటి శ్రీరాముడు తన అండ కోరిన శత్రువు రావణుని తమ్ముడు విభీషణుడికి అభయం ఇచ్చాడు. తన పరివారంలో కలుపుకున్నాడు. లంకానగరం వెళ్ళి విడిసి, చుట్టుముట్టి, ముట్టడించాడు. కోటలెక్కించాడు.

9-290-సీ.

ప్రాకారములు ద్రవ్వి పరిఖలు పూడిచి–
కోటకొమ్మలు నేలఁ గూలఁ ద్రోచి
వప్రంబు లగలించి వాకిళ్ళ పెకలించి–
తలుపులు విఱిచి యంత్రములు నెఱిచి
ఘనవిటంకంబులు ఖండించి పడవైచి–
గోపురంబులు నేలఁ గూలఁ దన్ని
మకరతోరణములు మహిఁ గూల్చి కేతనం–
బులు చించి సోపానములు గదల్చి

9-290.1-ఆ.

గృహము లెల్ల వ్రచ్చి గృహరాజముల గ్రొచ్చి
ధర్మకుంభచయము పాఱవైచి
కరులు కొలను చొచ్చి కలఁచిన కైవడిఁ
గపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు.

టీక:– ప్రాకారములు = ప్రహారీగోడలు; త్రవ్వి = తవ్వి; పరిఖలు = అగడ్తలను; పూడిచి = పూడ్చివేసి; కోటకొమ్మలున్ = బురుజులను; నేలన్ = నేలమీదకి; కూలద్రోచి = కూలగొట్టి; వప్రంబులన్ = కోటలను; అగలించి = పగులగొట్టి; వాకిళ్ళు = గుమ్మములను; పెకలించి = పీకి; తలుపులున్ = తలుపులను; విఱిచి = విరగ్గొట్టి; యంత్రములున్ = యంత్రములను; ఎఱిచి = చెరిచి; ఘన = గొప్ప; విటంకంబులున్ = గువ్వగూళ్ళను; ఖండించి = ఖండించి; పడవైచి = పడగొట్టి; గోపురంబులు = గోపురములను; నేలన్ = నేలమీదకి; కూలదన్ని = కూలగొట్టి; మకరతోరణములున్ = మకరతోరణములు; మహిన్ = నేలపై; కూల్చి =

పడవేసి; కేతనంబులున్ = జండాలను; చించి = చింపి; సోపానములున్ = మెట్లు; కదల్చి = కదిలించి; ; గృహములు = ఇళ్ళు; ఎల్లన్ = అన్నిటిని; వ్రచ్చి = బద్దలుకొట్టి; గృహరాజములన్ = భవనములను; గ్రొచ్చి = కూలగొట్టి; భర్మ = బంగారు; కుంభచయమున్ = కలశములన్నిటిని; పాఱవైచి = విసిరివేసి, పారేసి; కరులు = ఏనుగులు; కొలను = మడుగులను; చొచ్చి = ప్రవేశించి; కలచిన = కలచివేసిన; క్రైవడిన్ = వలె; కపులు = కోతులు; లంకన్ = లంకను; చొచ్చి = ప్రవేశించి; కలచిరి = కలచివేసిరి; అపుడు = అప్పుడు.

భావము:– మడుగులో ప్రవేశించిన ఏనుగులు కలచివేసినట్లు, వానర సేన లంక ప్రవేశించి ఇలా కలచివేసింది. ప్రహారీగోడలు తవ్వి, అగడ్తలు పూడ్చివేసి, బురుజులు నేల కూలగొట్టి, కోటలు పగులగొట్టి, గుమ్మాలు పీకేసి, తలుపులు విరగ్గొట్టి, యంత్రాలు చెరిచి, గువ్వగూళ్ళు పడగొట్టి, గోపురాలు కూలగొట్టి, మకరతోరణాలు నేలగూల్చి, జండాలను చింపిసి, మెట్లు కదిలించి, ఇళ్ళు బద్దలుకొట్టి, భవనాలు కూలగొట్టి, బంగారు కలశాలు పారేసి లంకను అల్లకల్లోలం చేసింది. అప్పుడు...

## 9-291-వ.

అంత నయ్యసురేంద్రుండు పంచినఁ గుంభ, నికుంభ, ధూమ్రాక్ష, విరూపాక్ష, సురాంతక, నరాంతక, దుర్ముఖ, ప్రహస్త, మహాకాయ ప్రముఖులగు దనుజవీరులు శర శరాసన తోమర గదాఖడ్గ శూల భిందిపాల పరశు పట్టిస ప్రాస ముసలాది సాధనంబులు ధరించి మాతంగ తురంగ స్యందన సందోహంబుతో బవరంబు చేయ సుగ్రీవ, పవనతనయ, పనస, గజ, గవయ, గంధమాదన, నీలాంగద, కుముద, జాంబవదాదు లా రక్కసుల నెక్కటి కయ్యంబు లందుఁ దరుల గిరులఁ గరాఘాతంబుల నుక్కడించి త్రుంచి; రంత.

టీక:– అంతన్ = అంతట; ఆ = ఆ; అసురేంద్రుండు = రావణుడు {అసురేంద్రుడు – అసురుల (రాక్షసుల)కు ఇంద్రుడు (ప్రభువు), హిరణ్యకశిపుడు, రావణుడు}; పంచినన్ = పంపించగా; కుంభ = కుంభుడు; నికుంభ = నికుంభుడు; ధూమ్రాక్ష = ధూమ్రాక్షుడు; విరూపాక్ష = విరూపాక్షుడు; సురాంతక = సురాంతకుడు; నరాంతక = నరాంతకుడు; దుర్ముఖ = దుర్ముఖుడు; ప్రహస్త = ప్రహస్తుడు; మహాకాయ = మహాకాయుడు; ప్రముఖులు = మున్నగు ముఖ్యులు; అగు = అయినట్టి; దనుజ = రాక్షస; వీరులు = శూరులు; శరశరాసన = విల్లంబులు; తోమర = కొరడాలు; గద = గదలు; ఖడ్గ = ఖడ్గములు; శూల = శూలములు; భిందిపాల = విడిచివాటుగుదియలు; పరశు = గొడ్డళ్ళు; పట్టిస = అడ్డకత్తులు; ప్రాస = ఈటెలు; ముసల = రోకళ్ళు; ఆది = మున్నగు; సాధనంబులున్ = ఆయుధములను; ధరియించి = చేపట్టి; మాతంగ = ఏనుగులు; తురంగ = గుఱ్ఱములు; స్యందన = రథముల; సందోహంబున్ = సమూహముల; తోన్ = తోటి; పవరంబు = యుద్ధము; చేయ = చేయగా; సుగ్రీవ = సుగ్రీవుడు; పవనతనయ = ఆంజనేయుడు {పవనతనయుడు –

వాయుపుత్రుడు, హనుమంతుడు}; పనస = పనసుడు; గజ = గజుడు; గవయ = గవయుడు; గంధమాదన = గంధమాదనుడు; నీల = నీలుడు; అంగద = అంగదుడు; కుముద = కుముదుడు; జాంబవత = జాంబవంతుడు; ఆదులు = మున్నగువారు; ఆ = ఆ; రక్కసులన్ = రాక్షసులను; ఎక్కటికయ్యంబు = ద్వంద్వయుద్ధముల; అందున్ = లో; తరులన్ = చెట్లను; గిరులన్ = కొండలను; కరాఘాతంబులన్ = పిడికిటిపోట్లతోను; ఉక్కడించి = చంపి; త్రుంచిరి = ముక్కలుచేసిరి; అంతన్ = అంతట.

భావము:– అంతట రావణుడు పంపించగా కుంభుడు, నికుంభుడు, ధూమ్రాక్షుడు, విరూపాక్షుడు, సురాంతకుడు, నరాంతకుడు, దుర్ముఖుడు, ప్రహస్తుడు, మహాకాయుడు మున్నగు రాక్షస వీరులు విల్లంబులు, కొరడాలు, గదలు, ఖడ్గాలు, శూలాలు, గుదియలు, గొడ్డళ్ళు, అడ్డకత్తులు, ఈటెలు, రోకళ్ళు మున్నగు ఆయుధాలు పట్టి ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు ఎక్కి వచ్చి యుద్ధం చేసారు. సుగ్రీవుడు, ఆంజనేయుడు, పనసుడు, గజుడు, గవయుడు, గంధమాదనుడు, నీలుడు, అంగదుడు, కుముదుడు, జాంబవంతుడు మున్నగు వీరులు; ఆ రాక్షసులను ద్వంద్వ యుద్ధాలలో చెట్లు, కొండలు పిడికిటిపోట్లుతో కొట్టి సంహరించారు. అంతట.

9-292-క.

ఆ యెడ లక్ష్మణుఁ డుజ్జ్వల
సాయకములఁ ద్రుంచె శైలసమకాయు సురా
జేయు ననర్గళమాయో
పాయున్నయగుణ విధేయు నయ్యతికాయున్.

టీక:– ఆ = ఆ; ఎడన్ = సమయమునందు; లక్ష్మణుడు = లక్ష్మణుడు; ఉజ్జ్వల = ప్రకాశవంతమైన; సాయకములన్ = బాణములతో; త్రుంచెన్ = సంహరించెను; శైల = పర్వతము; సమ = లాంటి; కాయున్ = దేహము కలవానిని; సుర = దేవతలకే; అజేయున్ = జయింపరానివానిని; అనర్గళ = అడ్డులేని; మాయా = మాయలతోకూడిన; ఉపాయున్ = ఉపాయములు కలవానిని; అనయగుణ = చెడ్డవారి ఎడ; విధేయున్ = విధేయత కలవాడు; ఆ = ఆ; అతికాయున్ = అతికాయుని.

భావము:– ఆ సమయంలో పర్వతసమ దేహుడు, దేవతలకు సైతం అజేయుడు, మాయోపాయుడు, చెడ్డవారి సేవకుడు అయిన అతికాయుడిని లక్ష్మణుడు ఉజ్జ్వలమైన బాణాలతో సంహరించాడు.

9-293-ఆ.

రామచంద్రవిభుఁడు రణమున ఖండించె
మేటికడిమి నీలమేఘవర్ణు
బాహుశక్తిపూర్ణుఁ బటుసింహనాదసం
కుచిత దిగిభకర్ణుఁ గుంభకర్ణు.

టీక:- రామచంద్రవిభుడు = శ్రీరాముడు; రణమునన్ = యుద్ధమునందు; ఖండించెన్ = సంహరించెను; మేటి = గొప్ప; కడిమిన్ = పరాక్రమముతో; నీల = నల్లని; మేఘ = మబ్బులవంటి; వర్ణున్ = రంగు కలవానిని; బాహు = భుజ; శక్తి = బలము; పూర్ణున్ = నిండుగా ఉన్న వానిని; పటు = గట్టి; సింహనాద = బొబ్బతో; సంకుచిత = దిమ్మెరపోయిన; దిగిభ = దిగ్గజముల; కర్ణున్ = చెవులు కలవానిని; కుంభకర్ణు = కుంభకర్ణుని.

భావము:- కుంభకర్ణుడు నల్లరంగు రాక్షసుడు, మహా పరాక్రమశాలి. అతను గట్టిగా బొబ్బ పెడితే దిగ్గజాల చెవులు దిమ్మెరపోతాయి. అంతటి కుంభకర్ణుడిని శ్రీరాముడు యుద్ధంలో సంహరించాడు.

9-294-క.

అలవున లక్ష్మణుఁ డాజి
స్థలిఁ గూల్చెన్ మేఘనాథుఁ జటులాహ్లాదున్
బలభేదిజయవినోదున్
బలజనితసుపర్వసుభటభావవిషాదున్.

టీక:- అలవునన్ = కష్టపడి; లక్ష్మణుడు = లక్ష్మణుడు; ఆజిస్థలిన్ = రణరంగమున; కూల్చెన్ = కూలగొట్టెను; మేఘనాథున్ = మేఘనాథుని; చటుల = భయంకరమైన; ఆహ్లాదున్ = నవ్వుకలవానిని; బలభేది = ఇంద్రుని; జయ = జయించుట; వినోదున్ = అవలీలగాచేయువానిని; బల = బలముండుటవలన; జనిత = కలిగిన; సుపర్వ = దేవతా; సుభట = సైనికుల; భావ = మనసులలో; విషాదున్ = దుఖముకలిగించువానిని.

భావము:- నవ్వుకూడా భయంకరంగా ఉండేవాడు, అవలీలగా ఇంద్రుడిని జయించే వాడిని, తన భుజబలంతో దేవతా సైనికుల మనసులు కలత పెట్టువాడు అయిన మేఘనాథుడిని రణరంగంలో లక్ష్మణుడు కష్టపడి కూలగొట్టాడు.

9-295-వ.

అంత.

టీక:- అంత = అప్పుడు.

భావము:- అప్పుడు....

9-296-క.

తనవా రందఱు మ్రగ్గిన
ననిమిషపతివైరి పుష్పకారూఢుండై
యనికి నడచి రామునితోఁ
ఘనరౌద్రముతోడ నంపకయ్యము చేసెన్.

టీక:- తనవారు = తనవైపుముఖ్యులు; అందఱున్ = అంతమంది; మ్రగ్గినన్ = మరణించగా; అనిమిషపతివైరి = రావణుడు {అనిమిషపతివైరి - అనిమిషపతి (ఇంద్రుని) వైరి, రావణుడు}; పుష్పకా = పుష్పకవిమానమును; ఆరూఢుండు = ఎక్కినవాడు; ఐ = అయ్యి; అని = యుద్ధమున; కిన్ = కి; నడచి = వెళ్ళి; రాముని = శ్రీరాముని; తోన్ = తోటి; ఘన = గొప్ప; రౌద్రము = పౌరుషము; తోడన్ = తోటి; అంప = బాణములతో; కయ్యమున్ = యుద్ధమును; చేసెన్ = చేసెను.

భావము:- తనవైపు ముఖ్య వీరులంతా మరణించగా, రావణుడు పుష్పకవిమానం ఎక్కి యుద్ధానికి వెళ్ళి శ్రీరామునితో గొప్ప పౌరుషంతో బాణయుద్ధం చేసాడు.

9-297-వ.

అ య్యవసరంబున.

టీక:- ఆ = ఆ; అవసరంబుననన్ = సమయమునందు.

భావము:- ఆ సమయంలో....

9-298-క.

సురపతిపంపున మాతలి
గురుతరమగు దివ్యరథముఁ గొనివచ్చిన, నా
ధరణీవల్లభుఁ డెక్కెను
ఖరకరుఁ డుదయాద్రి నెక్కు కైవడి దోఁపన్.

టీక:- సురపతి = ఇంద్రుడు; పంపునన్ = నియోగింపబడిన; మాతలి = మాతలి {మాతలి - ఇంద్రుని సారథి పేరు}; గురుతరము = బహుగొప్పది {గురు - గురుతరము - గురుతమమము}; అగు = ఐన; దివ్య =

భవ్యమైన; రథమున్ = రథమును; కొనివచ్చినన్ = తీసుకురాగా; ఆ = ఆ; ధరణీవల్లభుడు = శ్రీరాముడు; ఎక్కెను = అధిరోహించెను; ఖరకరుడు = సూర్యుడు {ఖరకరుడు – ఖర (తీవ్రమైన) కరుడు (కిరణములు గలవాడు), సూర్యుడు}; ఉదయాద్రిన్ = తూర్పుకొండను; ఎక్కు = ఎక్కుచున్న; కైవడిన్ = అట్లు; తోపగన్ = అనిపించగా.

భావము:– ఇంద్రుడు పంపగా ఇంద్రసారథి మాతలి బహు భవ్యమైన రథాన్ని తీసుకు వచ్చాడు. శ్రీరాముడు ఆ రథం ఎక్కాడు. అలా రాముడు ఎక్కుతుంటే, సూర్యుడు తూర్పుకొండ ఎక్కుతున్నట్లు అనిపించింది.

9-299-వ.

ఇట్లు దివ్యరథారూఢుండయి రామచంద్రుండు రావణున కిట్లనియె.

టీక:– ఇట్లు = ఈ విధముగ; దివ్యరథా = దివ్యరథమును; ఆరూఢుండు = ఎక్కినవాడు; అయి = ఐ; రామచంద్రుండు = శ్రీరాముడు; రావణున్ = రావణుని; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:– ఈ విధంగా దివ్యరథం ఎక్కిన శ్రీరాముడు రావణునితో ఇలా అన్నాడు.

9-300-మ.

"చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో
కపటబ్రాహ్మణమూర్తివై యబల నా కాంతారమధ్యంబునం
దపలాపించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్ని సం
తపనం బేగతి నోర్చువాఁడవు? దురంతం బెంతయున్ రావణా!

టీక:– చపలత్వంబునన్ = కోరికవలనతబ్బిబ్బయ్యి; డాగి = మరుగున ఉండి; హేమమృగమున్ = బంగారులేడిని; సంప్రీతిన్ = కావాలని; పుత్తెంచుటో = నియోగించుటకాదు; కపట = దొంగవేషమువేసుకొన్న; బ్రాహ్మణ = బ్రాహ్మణుని; మూర్తివి = రూపు కలవాడివి; ఐ = అయ్యి; అబలన్ = స్త్రీని; ఆ = ఆ; కాంతార = అడవి; మధ్యంబునన్ = లోపలనుండి; దపలాలించుటయో = దబాయించుటకాదు; మదీయ = నాయొక్క; శిత = వాడియైన; దివ్య = గొప్ప; అమోఘ = తిరుగులేని, వ్యర్థము కానట్టి; బాణ = బాణముల యొక్క; అగ్నిన్ = అగ్నియందు; సంతపనంబు = తాపముపొందుటను; ఏగతిన్ = ఎలా; ఓర్చువాడవు = ఓర్చుకొనగలవు; దురంతంబు = అంతులేనిది; ఎంతయున్ = ఎంతో ఎక్కువగా; రావణా = రావణుడా.

భావము:– "నాతో యుద్ధం చేయడమంటే చపలత్వంతో చాటునుంచి బంగారులేడిని

పంపడం కాదు; బ్రాహ్మణుడిలా దొంగవేషంవేసుకొని ఆడమనిషిని అడవిలో దబాయించడం కాదు. ఓ రావణా! తిరుగులేని, వ్యర్థం కాని నా వాడి బాణాగ్ని తాపం ఎలా ఓర్చుకోగలవో కదా.

9-301-క.

నీ చేసిన పాపములకు
నీచాత్మక! యముఁడు వలదు నేఁడిట నా నా
రాచముల ద్రుంచి వైచెద
ఖేచర భూచరులు గూడి క్రీడం జూడన్."

టీక:- నీ = నీవు; చేసిన = చేసినట్టి; పాపముల్ = దోషముల; కున్ = కు; నీచాత్మక = నీచబుద్ధికలవాడ; యముడు = యమధర్మరాజు; వలదు = అక్కరలేదు; నేడు = ఇవాళ; ఇటన్ = ఇక్కడ; నా = నా యొక్క; నారాచములన్ = బాణములతో; త్రుంచివైచెదన్ = ఖండించెదను; ఖేచర = దేవతలు {ఖేచరులు - ఖః (ఆకాశమున) చరులు (సంచరించెడివారు), దేవతలు}; భూచరులున్ = మానవులు {భూచరులు - భూమిపై చరించువారు, మానవులు, జంతువులు}; కూడి = కలసి; క్రీడన్ = లీలగా; చూడన్ = చూస్తుండగా.

భావము:- ఓ నీచ రావణా! నీవు చేసిన దోషాలకు యమధర్మరాజు అక్కరలేదు. ఖేచర భూచరులు అందరూ చూస్తుండగా ఇవాళ ఇక్కడే నా బాణాలతో నిన్ను సంహరిస్తాను."

9-302-వ.

అని పలికి.

టీక:- అని = అని; పలికి = పలికి.

భావము:- అని పలికి....

9-303-మ.

బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండ భీమంబుగా
బ్రళయోగ్రానలసన్నిభం బగు మహాబాణంబు సంధించి రా
జలలాముండగు రాముఁడేసె ఖరభాషాశ్రావణున్ దేవతా
బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్ రావణున్.

టీక:- బలు = బలమైన; వింటన్ = ధనుస్సునందు; గుణ = నారి; టంకృతమున్ = మీటినశబ్దములు, ధనుష్టంకారములు; నిగుడన్ = చెలరేగగా; బ్రహ్మాండ = అతిమిక్కిలి; భీమంబుగా = భీకరముగా; ప్రళయ =

ప్రళయకాలపు; ఉగ్ర = భయంకరమైన; అనల = అగ్ని; సన్నిభంబు = వంటిది; అగు = అయిన; మహా = గొప్ప; బాణంబున్ = బాణమును; సంధించి = ఎక్కుపెట్టి; రాజ = రాజులలో; లలాముండు = శ్రేష్ఠుడు; అగు = ఐన; రాముడు = శ్రీరాముడు; ఏసెన్ = ప్రయోగించెను; ఖర = పరుషమైన; భాషా = మాటలను; శ్రావణున్ = వినిపించువానిని; దేవతా = దేవతల; బల = సైన్యమును; విద్రావణున్ = పారదోలువానిని; వైరి = శత్రురాజుల; దారజన = భార్యల; గర్భస్రావణున్ = గర్భస్రావకారణుని; రావణున్ = రావణుని.

భావము:– ఆ రాజలలాముడైన శ్రీరాముడు గొప్పదైన ధనుష్టంకారాలు చెలరేగగా, పరుషంగా మాట్లాడే వాడు, దేవతల సైన్యాన్ని పారదోలే వాడిని, శత్రురాజుల భార్యల గర్భస్రావకారణుడు అయిన రావణుని పైన ప్రళయాగ్నిసమ భీకర బాణాలు ప్రయోగించాడు.

9-304-క.

దశరథసూనుండేసిన
విశిఖము హృదయంబుఁదూఱ వివశుం డగుచున్
దశకంధరుండు గూలెను
దశవదనంబులను రక్తధారలు దొరఁగన్.

టీక:– దశరథసూనుండు = శ్రీరాముడు {దశరథసూనుడు – దశరథుని పుత్రుడు, రాముడు}; ఏసిన = ప్రయోగించిన; విశిఖము = బాణము; హృదయంబున్ = హృదయమునందు; దూఱన్ = గుచ్చుకొనగ; వివశుండు = మరణాసన్నుడు {వివశుడు – 1. మరణకాలము సమీపించుట చేత కలత పొందిన బుద్ధి కలవాడు, 2. స్వవశముగాని బుద్ధిగలవాఁడు}; దశకంధరుండు = రావణుడు {దశకంధరుడు – పది కంఠముల వాడు, రావణాసురుడు}; కూలెన్ = పడిపోయెను; దశ = పది (10); వదనంబులను = నోళ్లనుండి; రక్త = రక్తపు; ధారలు = ధారలు; తొరగన్ = కారుచుండగా.

భావము:– శ్రీరాముడు వేసిన బాణం హృదయాన్ని దూసుకుపోగా రావణుడు పది నోళ్లనుండి రక్తం కారుతుండగా నేలకూలాడు.

9-305-వ.

అంతనా రావణుండు దెగుట విని.

టీక:– అంతన్ = అంతట; ఆ = ఆ; రావణుండు = రావణుడు; తెగుట = మరణించుట; విని = విని.

భావము:– అంతట ఆ రావణుడు మరణించడం విని....

9-306-సీ.

కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతో-
నంసభాగంబుల నావరింప
సేసముత్యంబులు చెదరఁ గర్ణిక లూడఁ-
గంఠహారంబులు గ్రందుకొనఁగ
వదనపంకజములు వాడి వాతెఱ లెండఁ-
గన్నీళ్ళవఱద లంగములు దడుప
సన్నపు నడుములు జవ్వాడఁ బాలిండ్ల-
బరువులు నడుములఁ బ్రబ్బికొనఁగ

9-306.1-ఆ.

నెత్తి మోఁదికొనుచు నెటిఁ బయ్యెదలు జాఱ
నట్టు నిట్టుఁ దప్పటడుగు లిడుచు
నసురసతులు వచ్చి రట భూతభేతాళ
సదనమునకు ఘోరకదనమునకు.

టీక:- కొప్పులు = జుట్టుముడుల; బిగి = బిగింపు; వీడి = వదులైపోయి; కుసుమ = పూల; మాలికల = హారముల; తోన్ = తోటి; అంసభాగంబులన్ = మూపులపై; ఆవరింపన్ = పరచుకొనగా; సేస = పాపట; ముత్యంబులున్ = ముత్యాలు; చెదరన్ = చెదిరిపోగా; కర్ణికలు = కర్ణాభరణములు; ఊడన్ = ఊడిపోగా; కంఠ = మెడలోని; హారంబులు = హారములు; క్రందుకొనగన్ = చిక్కుపడిపోగా; వదన = మోములు అనెడి; పంకజములు = పద్మములు; వాడి = వాడిపోగా; వాతెఱలు = పెదవులు; ఎండన్ = ఎండిపోగా; కన్నీళ్ళ = కన్నీళ్ళు; వఱదలు = వరదలై; అంగములున్ = అవయవములు; తడుపన్ = తడిపేయగా; సన్నపు = సన్నటి; నడుములు = నడుములు; జవ్వాడ = జవజవమని ఆడగా; పాలిండ్ల = స్తనముల; బరువులు = బరువులు; నడుములన్ = నడుములపైన; ప్రబ్బికొనగన్ = కమ్ముకోగా;
; నెత్తి = తల; మోదికొనుచు = బాదుకొంటూ; నెటిన్ = చక్కగాకట్టిన; పయ్యదలు = పైటలు; జాఱన్ = జారికోగా; అట్టునిట్టు = చలించెడి; తప్పటడుగులు = తప్పటడుగులు; ఇడుచు = వేస్తూ; అసుర = రాక్షస; సతులు = స్త్రీలు; వచ్చిరి = వచ్చిరి; అటన్ = అక్కడకు; భూతభేతాళ = పిశాచవిశేషములు {భూతభేతాళములు - పిశాచవిశేషములు, భూతములు (శ్మశానవాసులు). భేతాళములు (శవాలనాశ్రయించి ఉండు పిశాచములు)}; సదనమున్ = తిరుగుచున్నచోటి; కున్ = కి; ఘోర = భయంకరమైన; కదనమున్ =

యుద్ధభూమి; కున్ = కి.

భావము:– భూతభేతాళాలు తిరుగుతున్న ఆ భీకర యుద్ధభూమికి తప్పటడుగులు వేస్తూ రాక్షస స్త్రీలు వచ్చారు. వారి జుట్టుముళ్ళు వదులైపోయాయి, పూలహారాల మూపులపై పరచుకొన్నాయి, పాపటముత్యాలు చెదిరిపోయాయి, కర్ణాభరణాలు ఊడిపోయాయి, మెడలో హారాలు చిక్కుపడిపోయాయి, మోములు వాడిపోయాయి, పెదవులు ఎండిపోయాయి, కన్నీళ్ళు వరదలు కట్టాయి, స్తనాల బరువుకు సన్నటి నడుములు జవజవలాడాయి, పైటలు జారిపోయాయి. వారు తలబాదుకొంటూ దుఃఖిస్తున్నారు.

9–307–వ.

ఇట్లు వచ్చి తమతమ నాథులం గని, శోకించి; రందు మండోదరి రావణుం జూచి యిట్లనియె.

టీక:– ఇట్లు = ఇలా; వచ్చి = వచ్చి; తమతమ = వారివారి; నాథులన్ = భర్తలను; కని = చూసి; శోకించిరి = ఏడిచిరి; అందున్ = వారిలో; మండోదరి = మండోదరి; రావణున్ = రావణుని; చూచి = చూసి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:– ఇలా వచ్చిన ఆ రాక్షస కాంతలు వారివారి భర్తలను చూసి దుఃఖించారు, వారిలో మండోదరి రావణుని చూసి ఈ విధంగా పలికింది.

9–308–ఉ.

"హా! దనుజేంద్ర! హా! సురగణాంతక! హా! హృదయేశ! నిర్జరేం
ద్రాదుల గెల్చి నీవు కుసుమాస్త్రునికోలల కోర్వలేక సో
న్మాదముగన్ రఘుప్రవరుమానిని నేటికిఁ దెచ్చి? తప్పుడేఁ
గాదని చెప్పినన్ వినక కాలవశంబునఁ బొంది తక్కటా.

టీక:– హా = అయ్యో; దనుజేంద్రా = రాక్షసరాజా; హా = అయ్యో; సుర = దేవతా; గణ = సమూహములను; అంతక = సంహరించెడివాడ; హా = అయ్యో; హృదయేశ = మనసునున్నప్రభూ; నిర్జరేంద్ర = దేవేంద్రుడు; ఆదులన్ = మొదలగువారిని; గెల్చి = జయించి; నీవు = నీవు; కుసుమాస్త్రుని = మన్మథుని {కుసుమాస్త్రుడు – పూలబాణముల వాడు, మన్మథుడు}; కోలలన్ = బాణముల; కున్ = కు; ఓర్వలేక = తాళలేక; స = కలగిన; ఉన్మాదముగన్ = పిచ్చితోటి; రఘుప్రవరు = శ్రీరాముని {రఘుప్రవరుడు – రఘువు యొక్క ప్రవర (వంశము)లో పుట్టినవాడు, రాముడు}; మానినిన్ = భార్యను; ఏటికి = ఎందుకు; తెచ్చితి = తీసుకొని వచ్చితివి; అప్పుడే = ఆసమయమునందే; కాదు = వలదు; అని = అని; చెప్పినన్ = చెప్పినప్పటికి;

వినక = వినకుండ; కాలవశంబునన్ = మరణమును; పొందితి = పొందావు; అక్కటా = అయ్యో.

భావము:– “అయ్యో! ఓ రాక్షసరాజా! అయ్యో! హృదయేశ్వరా! దేవతల పాలిటి మృత్యుదేవతవు నీవు. దేవేంద్రాదులను జయించావు కాని మన్మథుని పూలబాణాలకు ఓర్వలేకపోయావు. చపలత్వంతో రాముడి భార్యను ఎందుకు తీసుకొచ్చావయ్యా? అయ్యయ్యో! వద్దు వద్దు అని ఎంత చెప్పినా వినకుండ మరణం పాలయ్యావు కదయ్యా.

9–309–ఆ.

ఎండఁ గాయ వెఱచు నినుడు వెన్నెలఁ గాయ
వెఱచు విధుఁడు గాలి వీవ వెఱచు
లంకమీఁద; నిట్టి లంకాపురికి మాకు
నధిప! విధవభావ మడరె నేఁడు.

టీక:– ఎండ = ఎండ; కాయనే = కాయుటకు; వెఱచున్ = బెదురును; ఇనుడు = సూర్యుడు; వెన్నెల = వెన్నెల; కాయన్ = కురిపించుటకు; వెఱచున్ = జంకెడివాడు; విధుడు = చంద్రుడు; గాలి = వాయువు; వీవన్ = వీచుటకు; వెఱచున్ = జంకును; లంక = లంక; మీదన్ = పైన; ఇట్టి = ఇటువంటి; లంకాపురి = లంకానగరమున; కిన్ = కు; మా = మా; కున్ = కు; అధిప = గొప్పవాడ; విధవభావము = వైధవ్యము; అడరె = కలిగినది; నేడు = ఇప్పుడు.

భావము:– నాథా! ఇప్పటి వరకూ లంక మీద సూర్యుడు గట్టిగా ఎండ కాయడానికి; చంద్రుడు వెన్నెల కురిపించడానికి; వాయువు గట్టిగా వీచడానికీ జంకేవారు. అటువంటిది నేడు మాకు ఈ లంకానగరానికి వైధవ్యం కలిగింది కదే.

★9–310–క.

దురితముఁ దలపరు గానరు
జరుగుదు రెటకైన నిమిష సౌఖ్యంబుల కై
పరవనితాసక్తులకును
బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే?"

టీక:– దురితము = పాపమని; తలపరు = భావించరు; కానరు = చూడరు; జరుగుదురు = పోయెదరు; ఎటకు = ఎక్కడికి; కైనన్ = ఐనప్పటికి; నిమిషసుఖంబుల = క్షణికసౌఖ్యముల; కై = కోసము; పర = ఇతరుల; వనితా = భార్యలను; ఆసక్తులున్ = కోరెడివారు; పర = ఇతరుల; ధన = సంపదలందు; రక్తుల =

కోరెడివారల; కున్ = కు; ఇహముపరము = సద్గతులు; కలదే = ఉండునా ఉండవు.

భావము:– పరభార్యాపేక్షా పరులు, పరధనాపేక్షా పరులు క్షణిక సుఖాల కోసం దేనికైనా తెగిస్తారు. వాళ్ళు పాపం అని భావించరు. మంచిచెడ్డలు చూడరు. అలాంటి వారికి ఇహపరాలు ఉండవు కదే."

## 9-311-వ.

అని విలపింప నంత విభీషణుండు రామచంద్రుని పంపుపడసి, రావణునకు దహనాది క్రియలు గావించె; నంత రాఘవేంద్రుండు నశోకవనంబున కేఁగి, శింశుపాతరు సమీపంబు నందు.

టీక:– అని = అని; విలపింపన్ = శోకించుచుండగా; అంతన్ = అంతట; విభీషణుండు = విభీషణుడు; రామచంద్రుని = శ్రీరాముని; పంపున్ = అనుజ్ఞ; పడసి = పొంది; రావణున్ = రావణుని; కున్ = కి; దహనాదిక్రియలు = అంత్యక్రియలు; కావించెన్ = చేసెను; అంతన్ = అప్పుడు; రాఘవేంద్రుండున్ = శ్రీరాముడు {రాఘవేంద్రుడు – రఘువంశపు ప్రభువు, రాముడు}; అశోకవనంబున్ = అశోకవనమున; కున్ = కి; ఏగి = వెళ్ళి; శింశుపాతరు = ఇరుగుడుచెట్టు (అశోకచెట్టువద్ద అని అంటుంటారు); సమీపంబున్ = దగ్గర; అందున్ = లో.

భావము:– అని రావణాసురుని భార్య మండోదరి శోకిస్తోంది. అంతట విభీషణుడు శ్రీరాముని అనుజ్ఞ పొంది రావణునికి అంత్యక్రియలు చేసాడు. అప్పుడు శ్రీరాముడు అశోకవనానికి వెళ్ళి అశోకచెట్టు దగ్గరకి వెళ్ళి.....

## 9-312-శా.

దైతేయప్రమదా పరీత నతిభీతన్ గ్రంథి బంధాలక
వ్రాతన్ నిశ్శ్వసనానిలాశ్రుకణ జీవం జీవదారామ భూ
జాతన్ శుష్కకపోల కీలిత కరాబ్జాతం బ్రభూతం గృశీ
భూతం బ్రాణసమేత సీతఁ గనియెన్ భూమీశుఁ డా ముందటన్.

టీక:– దైతేయ = రాక్షస; ప్రమదా = స్త్రీలుచేత; పరీతన్ = చుట్టబడినామెను; అతి = మిక్కిలి; భీతన్ = భయపడుతున్నామెను; గ్రంథి = చిక్కుముళ్ళు; బంధ = కట్టిన; అలక = ముంగురుల; వ్రాతన్ = సమూహముకలామెను; నిశ్వాసన్ = నిట్టూర్పులు అనెడి; అనిలన్ = అగ్నికలామెను; అశ్రుకణ = కన్నీటి; జీవన్ = బొట్లచేత; జీవత్ = బతుకుచున్న; ఆరామ = ఉద్యానవనపు; భూజాతన్ = చెట్లుకలామెను; శుష్క = చిక్కిపోయిన; కపోల = చెక్కిళ్ళపై; కీలిత = చేర్చబడిన; కర = చేయి యనెడి; అబ్జాతన్ = పద్మమును;

ప్రభూతన్ = ఉంచుకొన్నామెను; కృశీభూతన్ = మిక్కిలి కృశించినామెను; ప్రాణసమేతన్ = ప్రాణావశిష్ఠలానున్నామెను; సీతన్ = సీతను; కనియెన్ = చూసెను; భూమీశుడ = మహారాజు; ఆ = ఆ; ముందటన్ = ఎదురుగా.

భావము:- అక్కడ సీతాదేవిని రాక్షస స్త్రీలు చుట్టుముట్టి ఉన్నారు. ఆమె మిక్కిలి భయపడుతూ ఉంది. ఆమె జుట్టు చిక్కులు పడి అట్టలు కట్టింది. నిట్టూర్పులు నిగడిస్తూ, కన్నీరు కారుస్తూ, చిక్కిపోయిన చెక్కిళ్ళపై చేయి చేర్చి, కృశించిపోయి, ప్రాణావశిష్ట అయి ఉంది. అట్టి సీతాదేవిని శ్రీరాముడు చూసాడు.

### 9-313-వ.

కని రామచంద్రుండును దాపంబు నొంది, భార్యవలన దోషంబు లేకుంట వహ్నిముఖంబునం బ్రకటంబుజేసి, దేవతల పంపున దేవిం జేకొని.

టీక:- కని = చూసి; రామచంద్రుండునున్ = శ్రీరాముడుకూడ; తాపంబున్ = బాధ; ఒంది = పడి; భార్య = పెండ్లాము; వలన = వలన; దోషంబు = తప్పు; లేకుంటన్ = లేకపోవుటను; వహ్ని = అగ్ని; ముఖంబునన్ = ద్వారా; ప్రకటంబు = వెల్లడి యగుటను; చేసి = చేసి; దేవతల = దేవతల; పంపునన్ = అనుజ్ఞ ప్రకారము; దేవిన్ = భార్యను; చేకొని = చేపట్టి.

భావము:- చూసి, శ్రీరాముడుకూడ బాధ పడ్డాడు. భార్య వలన తప్పేమీ లేదని తెలిసినా, ఆ విషయాన్ని, ఆమె మహత్వం అగ్నిముఖంగా వెల్లడి చేసాడు, దేవతల అనుజ్ఞ ప్రకారము భార్యను స్వీకరించాడు.

### ★9-314-ఉ.

శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమజీవివి గమ్మని నిల్పె నర్థి సం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్యపోషణుఁ గృపాగుణభూషణు నవ్విభీషణున్.

టీక:- శోషిత = నాశనముచేయబడిన; దానవుండు = రాక్షసులు కలవాడు; నృప = రాజులనెడి చుక్కలలో; సోముడు = చంద్రునివంటివాడు; రాముడు = రాముడు; రాక్షసేంద్రత్ = రాక్షసరాజ్యాధికారపు; అశేష = అంతులేని; విభూతిన్ = వైభవమును; ఆకల్ప = కల్పాంతమువరకు; సమజీవివిన్ = చక్కగాజీవించెడివాడవు; కమ్ము = ఐ ఉండుము; అని = అని; నిల్పెన్ = నిలబెట్టెను; అర్థి = అడిగినవారిని; సంతోషణున్ = సంతోషపెట్టువానిని; పాప = పాపములను; శోషణున్ = రహితుని; అదూషణున్ =

నిందించుటలేనివానిని; శశ్వత్ = శాశ్వతముగా; అరోషణున్ = కోపములేనివానిని; మితా = మితముగా; భాషణున్ = మాట్లాడువానిని; ఆర్య = పెద్దలను; పోషణున్ = పోషించెడివానిని; కృపాగుణ = దయాగుణము; భూషణున్ = అలంకారముగాగలవానిని; ఆ = ఆ; విభీషణున్ = విభీషణుని.

భావము:– రాక్షసులను నాశనం చేసిన శ్రీరామచంద్రుడు పాప రహితుడు, అర్థులను తృప్తిపరచువాడు, మృదుభాషి, మితభాషి, శాంతస్వభావి, పెద్దలను గౌరవించువాడు, దయాగుణశాలి అయిన విభీషణుని రాక్షసరాజ్యానికి పట్టంకట్టాడు. అంతులేని వైభవంతో కల్పాంతంవరకు చక్కగా జీవించు అని అనుగ్రహించాడు.

## 9-315-వ.

ఇట్లు విభీషణసంస్థాపనుండయి రామచంద్రుఁడు సీతాలక్ష్మణ సమేతుండయి సుగ్రీవ హనుమదాదులం గూడికొని, పుష్పకారూఢుం డయి, వేల్పులు గురియు పువ్వులసోనలం దడియుచుఁ దొల్లి వచ్చిన తెరువుజాడలు సీతకు నెఱిఁగించుచు, మరలి నందిగ్రామంబునకు వచ్చె; నయ్యవసరంబున.

టీక:– ఇట్లు = ఈ విధముగ; విభీషణ = విభీషణుని; సంస్థాపనుండు = స్థిరపరచినవాడు; అయి = అయ్యి; రామచంద్రుండు = శ్రీరాముడు; సీత = సీత; లక్ష్మణ = లక్ష్మణుడు; సమేతుండు = కూడనున్నవాడు; అయి = ఐ; సుగ్రీవ = సుగ్రీవుడు; హనుమత్ = హనుమంతుడు; ఆదులన్ = మున్నగువారిని; కూడికొని = కలుపుకొని; పుష్పక = పుష్పకవిమానము; ఆరూఢుండు = ఎక్కినవాడు; అయి = ఐ; వేల్పులు = దేవతలు; కురియు = కురిపించెడి; పువ్వులన్ = పూల; సోనలన్ = జల్లులందు; తడియుచున్ = తడుస్తూ; తొల్లి = ఇంతకుపూర్వము; వచ్చిన = వచ్చినట్టి; తెరువు = దారి; జాడలు = గుర్తులు; సీత = సీత; కున్ = కి; ఎఱిగించుచున్ = తెలుపుతూ; మరలి = తిరిగి; నందిగ్రామంబున్ = నందిగ్రామమున; కున్ = కు; వచ్చెను = వచ్చెను; ఆ = ఆ; అవసరంబునన్ = సమయమునందు.

భావము:– ఈ విధంగా శ్రీరాముడు విభీషణుని లంకా రాజ్యంలో ప్రతిష్ఠించాడు. పిమ్మట, శ్రీరాముడు సీతాలక్ష్మణ, సుగ్రీవ, హనుమంతాదుల సమేతంగా పుష్పకవిమానం ఎక్కాడు. దేవతలు పూల జల్లులు కురిపిస్తున్నారు. ఇంతకుముందు వచ్చిన దారి, గుర్తులు సీతకి చూపుతూ తిరిగి నందిగ్రామానికి వచ్చాడు. ఆ సమయానికి...

9-316-ఆ.

రామచంద్రవిభుని రాక వీనుల విని
భరతుఁ డుత్సహించి పాదుకలను
మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను
లెల్ల గొలువ నన్న కెదురువచ్చె.

టీక:- రామచంద్రవిభుని = శ్రీరామ ప్రభువు; రాకన్ = వచ్చుటను; వీనులన్ = చెవులారా; విని = విని; భరతుడు = భరతుడు; ఉత్సహించి = ఉత్సాహముపొంది; పాదుకలను = రామపాదుకలను; మోచికొనుచున్ = మోసుకొంటూ; వచ్చి = చేరి; ముదముతో = సంతోషముతో; పుర = పట్టణములోని; జనులు = ప్రజలు; ఎల్లన్ = అందరు; కొలువన్ = సేవించుతుండగ; అన్న = అన్న; కిన్ = కి; ఎదురువచ్చె = ఎదురువెళ్ళెను.

భావము:- శ్రీరామచంద్రప్రభువు రాక తెలిసిన భరతుడు ఉత్సాహంగా రామపాదుకలను మోసుకొంటూ అక్కడకు నందిగ్రామం చేరాడు. అయోధ్య ప్రజలు అందరు సేవిస్తూ వెంట వచ్చారు. అన్న శ్రీరాముడిని చేరగానే సంతోషముగా ఎదురువెళ్ళాడు.

9-317-వ.

వచ్చి పాదుకల ముందట నిడికొని, యెడనెడ సాష్టాంగదండప్రణామంబులు చేయుచు, మెల్లమెల్లన డాసి, రామచంద్రుని పాదంబులు దన నొసలం గదియించి, తచ్చరణరేణువులు దుడిచి, శిరంబునం జల్లికొని, తనివి చనక, మఱియు నప్పదకమలంబు లక్కున మోపి కొనుచు, సంతసంపుఁ గన్నీటం గడిగి, క్షేమంబు లరయుచుండె; నంత సీతాలక్ష్మణ సహితుండయి విభుండును, దన కెదురువచ్చిన బ్రాహ్మణ జనంబులకు నమస్కరించి, తక్కినవారలచేత మన్ననలు పొంది, వారల మన్నించె; నయ్యవసరంబున.

టీక:- వచ్చి = వచ్చి; పాదుకలన్ = పాదుకలను; ముందటన్ = ఎదురుగా; ఇడికొని = ఉంచుకొని; ఎడనెడ = అక్కడక్కడ; సాష్టాంగదండప్రణామంబులు = సాష్టాంగనమస్కారములు {సాష్టాంగదండప్రణామము - అష్ట (ఎనిమిది 1నుదురు 2కళ్ళు 3ముక్కు 4చెవులు 5 గడ్డము 6రొమ్ము 7ఉదరము 8కాళ్ళు) అంగములతోను దండము (కఱ్ఱ) వలె నేలపై పండుకొని చేయు నమస్కారము}; చేయుచున్ = చేస్తూ; మెల్లమెల్లన = మెల్లగా; డాసి = దగ్గరకువచ్చి; రామచంద్రుని = శ్రీరాముని; పాదంబులున్ = పాదములను; తన = తనయొక్క; నొసలన్ = నుదుట; కదియించి = చేర్చుకొనుచు; తత్ = అతని; చరణ = పాద; రేణువులున్ = ధూళిని; తుడిచి = తుడిచి; శిరంబునన్ = తలపైన; జల్లికొని =

జల్లుకొని; తనివి = తృప్తి; చనక = చెందక; మఱియున్ = ఇంకను; ఆ = ఆ; పాద = పాదములు అనెడి; కమలంబులు = పద్మములు; అక్కునన్ = వక్షమునకు; మోపి = చేర్చుకొని; సంతసంపు = ఆనంద; కన్నీటన్ = భాష్పంబులతో; కడిగి = కడిగి; క్షేమంబులు = క్షేమసమాచారములు; అరయుచుండెన్ = తెలుసుకొనుచుండెను; అంత = అంతట; సీతా = సీతాదేవి; లక్ష్మణ = లక్ష్మణుల; సహితుండు = కూడనున్నవాడు; అయి = ఐ; విభుండును = ప్రభువు; తన = తన; కున్ = కు; ఎదురువచ్చిన = ఆహ్వానించుటకువచ్చిన; బ్రాహ్మణ = విప్రుల; జనంబుల్ = సమూహమున; కున్ = కు; నమస్కరించి = నమస్కారముచేసి; తక్కిన = మిగిలిన; వారల = వారి; చేత = వలన; మన్ననలు = మర్యాదలు; పొంది = తీసుకొని; వారలన్ = వారిని; మన్నించెను = ఆదరించెను; ఆ = ఆ; అవసరంబునన్ = వేళయందు.

భావము:– అలా అన్నకు ఎదురు వచ్చిన భరతుడు, పాదుకలను ఎదురుగా ఉంచుకుంటూ, అడగడుక్కి సాష్టాంగనమస్కారాలు చేస్తూ మెల్లగా దగ్గరకు వచ్చి శ్రీరాముడి పాదాలు తన నుదుట చేర్చుకొన్నాడు. పాదధూళి తలపై జల్లుకొని తృప్తి చెందక, ఆ పాదాలను తన వక్షానికి చేర్చుకొని, ఆనంద భాష్పాలతో కడిగాడు. క్షేమసమాచారాలు అడిగాడు. అంతట సీతాలక్ష్మణ సమేతుడైన శ్రీరాముడు వచ్చిన విప్రులకు నమస్కారంచేసాడు. మిగిలిన వారి మర్యాదలు స్వీకరించి ఆదరించాడు.

## 9-318-చ.

నృపవర! పెక్కునాళ్ళఁగొలె నిన్ గనకుండిన యట్టి నేఁడు మా
తపములుపండె నిందఱము ధన్యులమైతి మటంచుఁ బుట్టముల్
చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతములాడుచుఁ బాడుచున్ గత
త్రపులయి యాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగ జేసి రెల్లెడన్.

టీక:– నృపవర = మహారాజ; పెక్కు = అనేక; నాళ్ళ = రోజుల; కొలె = నుండి; నిన్ = నిన్ను; కనకుండినన్ = చూడకపోయినాము; అట్టి = అటువంటిది; నేడు = ఇవాళ; మా = మాయొక్క; తపములు = తపస్సులు; పండెన్ = ఫలించినవి; ఇందఱమున్ = అందరము; ధన్యులము = భాగ్యవంతులము; ఐతిమి = అయినాము; అట = అని; అంచున్ = అనుచు; పుట్టముల్ = వస్త్రములను; చపలతన్ = నిస్సంకోచముగా; త్రిప్పి = గాలిలోతిప్పుచు; పువ్వులన్ = పూలతో; వసంతములు = వసంతములు; ఆడుచున్ = ఆడుతు; పాడుతున్ = పాడుతు; గత = పోయిన; త్రపులు = సంకోచములుకలవారు; అయి = ఐ; ఆడుచున్ = ఆడుతూ; ప్రజలు = లోకులు; తద్దయున్ = అధికముగా; పండుగ = పండుగలు; చేసిరి = చేసుకొనిరి; ఎల్లెడలన్ = ప్రతిచోటా.

భావము:– ప్రతిచోటా ప్రజలందరు పైబట్టలు గాలిలోతిప్పుతూ, పూల వసంతాలు ఆడుతు, పాడుతు, "మహారాజ! శ్రీరామ! అనేక రోజుల నుండి నిన్ను చూడకలేకపోయాం. ఇవాళ్టికి మా తపస్సులు ఫలించాయి. భాగ్యవంతులం అయ్యాము." అని అంటూ గొప్పగా పండుగలు చేసుకొన్నారు.

★9–319–సీ.

కవ గూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస–
 రాజు నొక్కటఁ జామరములు వీవ
హనుమంతుఁ డతిధవళాతపత్రముఁ బట్ట–
 బాదుకల్ భరతుండు భక్తిఁ దేర
శత్రుఘ్ను డమ్ములుఁ జాపంబుఁ గొనిరాఁగ–
 సౌమిత్రి భృత్యుఁడై చనువుచూప
జలపాత్రచేఁబట్టి జనకజ గూడిరాఁ–
 గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ

9–319.1–ఆ.

బసిఁడి కేడె మర్థి భల్లూకపతి మోచి
కొలువఁ బుష్పకంబు వెలయ నెక్కి
గ్రహము లెల్లఁ గొలువఁ గడు నొప్పు సంపూర్ణ
చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె.

టీక:– కవగూడి = జంటగాకలిసి; ఇరు = రెండు (2); దెసన్ = పక్కలను; కపిరాజు = సుగ్రీవుడు; రాక్షసరాజున్ = విభీషణుడు; ఒక్కటన్ = కూడి; చామరంబులు = చామరములు {చామరము – చమరీమృగముకుచ్చుతో చేయబడి గాలి విసురుటకు ఉపయోగపడెడి సాధనము, తెల్లగా ఉండును కనుక వింజామరము}; వీవన్ = వీచుచుండగ; హనుమంతుడు = హనుమంతుడు; అతి = మిక్కిలి; ధవళ = తెల్లని;

అతపత్రమున్ = గొడుగు; పట్ట = పట్టుచుండగ; పాదుకల్ = పావుకోళ్ళు, కాలిజోళ్ళు; భరతుండు = భరతుడు; భక్తిన్ = భక్తితో; తేర = తీసుకురాగ; శత్రుఘ్నుడు = శత్రుఘ్నుడు; అమ్ములు = బాణములు; చాపంబు = విల్లు; కొనిరాగ = తీసుకురాగా; సౌమిత్రి = లక్ష్మణుడు {సౌమిత్రి – సుమిత్రకొడుకు, లక్ష్మణుడు}; భృత్యుడు = సేవకుడు; ఐ = అయ్యి; చనువు = దగ్గరతనము; చూపన్ = చూపించుతుండగ; జల = నీటి; పాత్రన్ = కలశమును; చేబట్టి = చేతిలోపట్టుకుని; జనకజ = జానకీదేవి; కూడిరాన్ = కూడా వస్తుండగ; కాంచన = బంగారపు; ఖడ్గము = కత్తిని; అంగదుడ = అంగదుడు; మోవన్ = మోయుచుండగా; పసిడి = బంగారపు;

; కేడెమున్ = డాలును; అర్థిన్ = కోరి; భల్లూకపతి = జాంబవంతుడు; మోచి = మోయుచు; కొలువన్ = సేవించుచుండగ; పుష్పకంబున్ = పుష్పకవిమానమును; వెలయన్ = ప్రకాశించుచు; ఎక్కి = అధిరోహించి; గ్రహములు = గ్రహములు; ఎల్లన్ = సమస్తము; కొలువన్ = సేవించుచుండగ; కడున్ = మిక్కిలి; ఒప్పు = చక్కగానుండెడి; సంపూర్ణ = నిండు; చంద్రున్ = చంద్రుని; పగిదిన్ = వలె; రామచంద్రుడు = శ్రీరాముడు; ఒప్పెన్ = చక్కగానుండెను.

భావము:– జంటగా రెండు పక్కలా చేరి సుగ్రీవ విభీషణులు కూడి చామరాలు వీస్తున్నారు; హనుమంతుడు వెల్లగొడుగు పట్టుతున్నాడు; పావుకోళ్ళు భరతుడు భక్తితో తీసుకు వస్తున్నాడు; శత్రుఘ్నుడు విల్లంబులు తీసుకువస్తున్నాడు; లక్ష్మణుడు చనువుగా సేవచేస్తున్నాడు; కలశం పట్టుకుని జానకీదేవి కూడా వస్తోంది; బంగారపు కత్తిని అంగదుడు మోసుకొస్తున్నాడు; బంగారపు డాలును జాంబవంతుడు మోసుకొస్తున్నాడు. ఆ విధంగ దివ్యవైభవాలతో పుష్పకవిమానం అధిరోహించి గ్రహాలు సేవించే నిండు చంద్రుడిలా శ్రీరాముడు చక్కగా ఉన్నాడు.

## 9-320-వ.

ఇట్లు పుష్పకారూఢుండై, కపి బలంబులు చేరికొలువ. శ్రీరాముం డయోధ్యకుం జనియె; నంతకు మున్న యప్పురంబునందు.

టీక:– ఇట్లు = ఈ విధముగ; పుష్పక = పుష్పకవిమానమును; ఆరూఢుండు = ఎక్కినవాడు; ఐ = అయ్యి; కపి = వానర; బలంబులున్ = సేనలు; చేరికొలువన్ = సేవించుచుండగ; శ్రీరాముండు = శ్రీరాముడు; అయోధ్య = అయోధ్యానగరమున; కున్ = కు; చనియె = వెళ్ళెను; అంత = దాని; కున్ = కి; మున్న = ముందే; ఆ = ఆ; పురంబున్ = నగరము; అందున్ = లో.

భావము:– ఈ విధంగ పుష్పకవిమానం ఎక్కి వానర సేనలు సేవిస్తుండగా శ్రీరాముడు అయోధ్యకు వెళ్ళాడు. దానికి ముందే ఆ నగరంలో.

9-321-సీ.

వీథులు చక్కఁ గావించి తోయంబులు-
చల్లి రంభా స్తంభచయము నిలిపి
పట్టుజీరలు చుట్టి బహుతోరణంబులుఁ-
గలువడంబులు మేలుకట్లుఁ గట్టి
వేదిక లలికించి వివిధరత్నంబుల-
ముగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథలెల్ల వ్రాయించి-
ప్రాసాదముల దేవభవనములను

9-321.1-తే.

గోపురంబుల బంగారు కుండ లెత్తి
యెల్ల వాకిండ్ల గానిక లేర్పరించి
జనులు గైచేసి తూర్యఘోషములతోడ
నెదురు నడతెంచి రా రాఘవేంద్రుకడకు.

టీక:- వీథులున్ = దారులు; చక్కన్ = చక్కగా; కావించి = చేసి; తోయంబులున్ = నీళ్ళు; చల్లి = కళ్ళాపిజల్లి; రంభా = అరటి; స్తంభ = స్తంభముల; చయమున్ = సమూహములను; నిలిపి = నిలబెట్టి; పట్టుజీరలున్ = పట్టుబట్టలు; చుట్టి = కట్టి; బహు = అనేకమైన; తోరణంబులు = తోరణములు; కలువడంబులు = బంగారు కలువపూలదండలు; మేలుకట్టులున్ = చాందినీలు; కట్టి = కట్టి; వేదికల్ = అరుగులు; అలికించి = అలికించి {అలికి - అలుకుట చేసి - గోడ మట్టిగచ్చు వంటివి మరల మట్టి పేడలతో (గోడలకు సున్నము వేసినట్లు) మెత్తుట}; వివిధ = రకరకముల; రత్నంబుల = రత్నాల; ముగ్గులున్ = ముగ్గులను; పలు = అనేక; చందంబులుగన్ = విధములైనవి; పెట్టి = వేసి; కలయ = అంతట; గోడల = గోడలపైన; రామ = రాముని; కథలు = కథలు; ఎల్లన్ = సర్వము; వ్రాయించి = వ్రాయించి; ప్రాసాదములన్ = భవనములయొక్క; దేవభవనములను = దేవాలయములయొక్క;
; గోపురంబులన్ = గోపురములమీద; బంగారు = బంగారపు; కుండలు = కలశములు; ఎత్తి = పెట్టి; ఎల్ల = అన్ని; వాకిండ్లన్ = వాకిళ్ళలోను; కానికలు = కానుకలు; ఏర్పరచి = అమర్చి; జనులు = ప్రజలు; కైచేసి = నమస్కరించి; తూర్యఘోషముల = మంగళవాయిద్యముల; తోడన్ = తోటి; ఎదురునడతెంచిరి = ఎదుర్కోలుచేయ వెళ్ళిరి; ఆ = ఆ; రాఘవేంద్రున్ = శ్రీరాముని {రాఘవేంద్రుడు - రఘువంశపు ప్రభువు,

రాముడు}; కడ = వద్ద; కున్ = కు.

భావము:– వీధులు అన్నీ చక్కగా తుడిచి కళ్ళాపిజల్లారు. అరటి స్తంభములు నిలబెట్టి పట్టుబట్టలు కట్టారు. తోరణాలు, బంగారు కలువపూల దండలు, చాందినీలు కట్టారు. అరుగులు అలికించి రత్నాల ముగ్గులు వేసారు. గోడలపై రామకథలు వ్రాయించారు. భవనాల దేవాలయాల, గోపురాల మీద బంగారు కలశాలు పెట్టారు, వాకిళ్ళలో కానుకలు అమర్చారు. ఇలా సర్వాంగ సుందరంగా పట్టణాన్ని అలంకరించి, ప్రజలు నమస్కరించి, మంగళ వాయిద్యాలతో శ్రీరాముడికి ఎదుర్కోలు చేసారు.

9-322-క.

సమద గజదానధారల
దుమదుమలై యున్న పెద్ద త్రోవలతోడన్
రమణీయ మయ్యె నప్పురి
రమణుఁడు వచ్చినఁ గరంగు రమణియపోలెన్.

టీక:– సమద = మదించిన; గజ = ఏనుగుల; దాన = మదజల; ధారలన్ = ధారలతో; దుమదుమలు = తడసినవి; ఐ = అయ్యి; ఉన్న = ఉన్నట్టి; పెద్దత్రోవల = రాజమార్గముల; తోడన్ = తోటి; రమణీయము = మనోహరముగా; అయ్యెన్ = అయినది; ఆ = ఆ; పురి = పట్టణము; రమణుడు = భర్త; వచ్చినన్ = రాకతో; కరంగు = కరిగిపోయెడి; రమణియ = భార్య; పోలెన్ = వలె.

భావము:– అప్పుడు ఆ పట్టణం మదించిన ఏనుగుల మదజల ధారలతో తడసిన రాజమార్గాలతో మనోహరంగా, భర్త రాకకై ఎదురు చూస్తున్న భార్యలా ఉంది.

9-323-ఆ.

రామచంద్రవిభుని రాకఁ దూర్యములతో
రథ గజాశ్వ సుభటరాజితోడ
నమరెఁ బురము చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు
జంతుభంగమిలిత జలధిభంగి.

టీక:– రామచంద్రవిభున్ = శ్రీరాముని; రాకన్ = వచ్చుటతో; తూర్యములు = మంగళవాద్యములు; తోన్ = తోటి; రథ = రథములు; గజ = ఏనుగులు; అశ్వ = గుఱ్ఱములు; సుభట = సైనికుల; రాజి = సమూహముల; తోడన్ = తోటి; అమరెన్ = విలసిల్లెను; పురము = నగరము; చంద్రుడు = చంద్రుడు; అరుదేర

= పొడచూపగా; ఘూర్ణిల్లు = సందడించెడి; జంతు = జలచరములు; భంగ = అలలుతో; మిలిత = కలిగిన; జలధి = సముద్రము {జలధి – జలము (నీటి)కి నిధి (నివాసము) ఐనది, సముద్రము}; భంగిన్ = వలె.

భావము:– చంద్రుని రాకతో సాగరం ఉప్పొంగినట్లు, రామచంద్రుని రాకతో అయోధ్యా నగరం మంగళవాద్యములుతో; రథాలు, ఏనుగులు, గుఱ్ఱాలు, సైనికులుతో విలసిల్లింది.

9–324–వ.

ఇట్లొప్పుచున్న యప్పురంబు ప్రవేశించి, రాజమార్గంబున రామచంద్రు డరుగుచున్న సమయంబున.

టీక:– ఇట్లు = ఇలా; ఒప్పుచున్న = చక్కగా ఉన్నట్టి; ఆ = ఆ; పురంబున్ = పట్టణమును; ప్రవేశించి = ప్రవేశించి; రాజమార్గంబున = ముఖ్యవీథమ్మట; రామచంద్రుడు = శ్రీరాముడు; అరుగుచున్న = వేంచేయుచున్న; సమయంబునన్ = సమయమునందు.

భావము:– ఇలా ముస్తాబయిన ఆ పట్టణం ప్రవేశించి రాజమార్గంలో శ్రీరాముడు వేంచేస్తున్న సమయంలో.

9–325–మ.

"ఇతఁడే రామనరేంద్రుఁ డీ యబలకా యింద్రారి ఖండించె న
ల్లతఁడే లక్ష్మణుఁ డాతఁడే కపివరుం డా పొంతవాఁడే మరు
త్సుతుఁ డా చెంగట నా విభీషణుఁ" డటంచుం చేతులం జూపుచున్
సతులెల్లం బరికించి చూచిరి పురీసౌధాగ్రభాగంబులన్.

టీక:– ఇతడే = ఇతనే; రామ = రాముడు అనెడి; నరేంద్రుడు = రాజు; ఈ = ఈ; అబల = స్త్రీ; కిన్ = కి; ఆ = ఆ; ఇంద్రారిన్ = రావణుని; ఖండించెన్ = సంహరించెను; అల్ల = అదిగో; అతడె = అతనె; లక్ష్మణుడు = లక్ష్మణుడు; ఆతడే = అతనే; కపివరుండు = సుగ్రీవుడు; ఆ = ఆ; పొంతవాడే = పక్కవాడే; మరుత్సుతుడు = ఆంజనేయుడు {మరుత్సుతుడు – వాయుపుత్రుడు, హనుమంతుడు}; ఆ = ఆ; చెంగటన్ = పక్కన; ఆ = ఆ; విభీషణుడు = విభీషణుడు; అట = అని; అంచున్ = అనుచు; చేతులన్ = చేతులతో; చూపుచున్ =చూపించుచు; సతులు = స్త్రీలు; ఎల్లన్ = అందరు; పరికించి = పరిశీలనగా; చూచిరి = చూసిరి; పురీ = పట్టణములోని; సౌధ = మేడల; అగ్రభాగంబులన్ = డాబాలపైనుంచి.

భావము:– నగరకాంతలు అందరూ భవనాలపైకెక్కి చూస్తూ, “ఇతనే రాజు రాముడు. ఇదిగో సీతా దేవి, రాముడు ఈమెకోసమే రావణుణ్ణి సంహరించాడు. అడిగో లక్ష్మణుడు, సుగ్రీవుడు అడిగో,

ఆ పక్కవాడే ఆంజనేయుడు, ఆ పక్కన ఆ విభీషణుడు అని అంటూ చేతులతో చూపించుకుంటూ పరిశీలనగా చూడసాగారు.

9-326-వ.

ఇట్లు సమస్తజనంబులు చూచుచుండ రామచంద్రుండు రాజమార్గంబునం జనిచని.

టీక:- ఇట్లు = ఈ విధముగ; సమస్త = సమస్తమైన; జనంబులున్ = ప్రజలును; చూచుచుండన్ = చూస్తుండగా; రామచంద్రుండు = శ్రీరాముడు; రాజమార్గంబునన్ = రాజవీధిలో; చనిచని = వెళ్లి.

భావము:- ఈ విధంగా ప్రజలు అందరూ చూస్తుండగా శ్రీరాముడు రాజమార్గంలో వెళ్లి...

9-327-సీ.

పటికంపు గోడలు బవడంపు వాకిండ్లు-
నీలంపుటరుగులు నెఱయఁ గలిగి
కమనీయ వైడూర్య స్తంభచయంబుల-
మకరతోరణముల మహిత మగుచు
బడగల మాణిక్యబద్ధ చేలంబులఁ-
జిగురుఁ దోరణములఁ జెలువు మీఱి
పుష్పదామకముల భూరివాసనలను-
బహుతరధూపదీపముల మెఱసి

9-327.1-తే.

మాఱువేల్పులభంగిని మలయుచున్న
సతులుఁ బురుషులు నెప్పుడు సందడింప
గుఱుతు లిడరాని ధనముల కుప్ప లున్న
రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు.

టీక:- పటికంపు = స్ఫటికముల; గోడలు = గోడలు; పవడంపు = పగడాల; వాకిండ్లు = వాకిళ్ళు; నీలంపు = ఇంద్రనీలాల; అరుగులు = వేదికలు; నెఱయన్ = నిండుగ; కలిగి = ఉండి; కమనీయ =

మనోహరమైన; వైదూర్యక = వైదూర్యములుపొదిగిన; స్తంభ = స్తంభముల; చయములన్ = సమూహములతో; మకరతోరణములన్ = మకరతోరణములతోను; మహితము = గొప్పగా ఉన్నది; అగుచున్ = అగుచు; పడగలన్ = ధ్వజములతో; మాణిక్య = మాణిక్యములు; బద్ద = పొదిగిన; చేలంబులన్ = వస్త్రములతో; చిగురు = చిగురటాకుల; తోరణంబులన్ = తోరణములతో; చెలువుమీఱి = అందగించి; పుష్ప = పూల; దామకముల = దండల; భూరి = చాలాఎక్కువ; వాసనలను = సువాసనలుతో; బహుతర = చాలాఎక్కువ {బహు – బహుతర –బహుతమ}; ధూప = ధూపములు; దీపములన్ = దీపములతోను; మెఱసి = వెలిగిపోతూ;

; మాఱువేల్పుల = దేవతలలాంటి; భంగిని = విధముగ; మలయుచున్న = తిరుగుచున్న; సతులున్ = స్త్రీలు; పురుషులున్ = మగవారు; ఎప్పుడున్ = అంతా; సందడింపన్ = సందడిచేయుచుండగా; గుఱుతులిడరాని = లెక్కలేనన్ని; ధనముల = ధనముల; కుప్పలు = రాశులు; ఉన్న = ఉన్నట్టి; రాజసదనంబున్ = రాజప్రసాదమున; కున్ = కు; వచ్చెన్ = వచ్చెను; రామవిభుడు = శ్రీరామచంద్రప్రభువు.

**భావము:–** స్ఫటికాల గోడలు, పగడాల వాకిళ్ళు, ఇంద్రనీలాల వేదికలు నిండుగ ఉన్నాయి. వైదూర్యాలు పొదిగిన స్తంభాలు, మకర తోరణాలతో, ధ్వజాలతో, మాణిక్యాలు పొదిగిన వస్త్రాలతో, చిగురటాకుల తోరణాలతో, పూలదండలసువాసనలతో, ధూప దీపాలతో, దేవతలలా తిరుగుతున్న స్త్రీపురుషులతో, అనంత ధనరాసులతో మనోజ్ఞంగా ప్రకాశిస్తున్న రాజప్రసాదానికి శ్రీరామచంద్రప్రభువు వచ్చాడు.

## 9-328-వ.

ఇట్లు వచ్చి.

**టీక:–** ఇట్లు = ఇలా; వచ్చి = వచ్చి.

**భావము:–** ఇలా అంతపురం చేరి....

## 9-329-ఉ.

తల్లులకెల్ల మ్రొక్కి తమ తల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాళికిన్ వినతుఁడై చెలికాండ్రను దమ్ములం బ్రసం
పుల్లతఁ గౌగలించుకొని భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ జాల మన్ననలు చేసె నమాత్యులఁ బూర్వభృత్యులన్.

**టీక:–** తల్లుల = తల్లులు; కున్ = కు; ఎల్లన్ = అందరకు; మ్రొక్కి = నమస్కరించి; తమ = తమ; తల్లి = తల్లి(కన్న); కిన్ = కి; వందనము = నమస్కారము; ఆచరించి = చేసి; అల్లల్ల = అలా అలా; బుధ = పండితుల; ఆళి = సమూహమున; కిన్ = కి; వినతుడు = వినయముచూపినవాడు; ఐ = అయ్యి; చెలికాండ్రనున్ =

స్నెహితులను; తమ్ములన్ = తమ్ముళ్ళను; ప్రసంపుల్లతన్ = మిక్కిలి సంతోషముతో; కౌగలించుకొని = ఆలింగనములుచేసి; భూవరుడు = రాజు; ఓలిన్ = వరుసగా; కృపారసంబు = కనికరములు; రంజిల్లగన్ = ఉట్టిపడునట్లు; చాల = అధికముగ; మన్ననలు = ఆదరములుచూపుట; చేసెన్ = చేసెను; అమాత్యులన్ = మంత్రులను; పూర్వ = పాత; భృత్యులన్ = సేవకులను.

భావము:– శ్రీరాముడు తల్లులు అందరికి నమస్కరించి తమ కన్నతల్లికి నమస్కారం చేసాడు. పండితుల ఎడ వినయం చూపించాడు. స్నేహితులకు తమ్ముళ్ళకు ఆలింగనాలు చేసాడు. మంత్రులను, సేవకులకు మిక్కిల ఆదరం చూపించాడు.

## 9-330-వ.

తత్సమయంబునఁ దల్లులు

టీక:– తత్ = ఆ; సమయంబునన్ = సమయమునందు; తల్లులు = తల్లులు.

భావము:– ఆ సమయంలో తల్లులు....

## 9-331-చ.

కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి చేతులం
బుడుకుచు మోములుందలలుబోరన ముద్దులుగొంచునవ్వుచుం
దొడలకు వారి రాఁదిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్
వెడలిన ప్రాణముల్ దగఁ బ్రవిష్టములయ్యె నటంచు నుబ్బుచున్.

టీక:– కొడుకులున్ = పుత్రులు; పెద్దకోడలునున్ = పెద్దకోడలు; గొబ్బున = శీఘ్రముగా; మ్రొక్కిన = నమస్కరించగా; ఎత్తి = పైకిలేవదీసి; చేతులన్ = చేతులతో; పుడుకుచున్ = నిమురుచు; మోములున్ = ముఖములు; తలలున్ = తలలు; బోరన = వడివడిగా; ముద్దులున్ = ముద్దులు; కొంచున్ = పెడుతూ; నవ్వుచున్ = నవ్వుతూ; తొడలు = ఒడి; కున్ = లోనికి; వారిని = వారిని; రాదిగిచి = చేరదీసి; తోగగన్ = తడిపి; చేసిరి = వేసిరి; నేత్రధారలన్ = కన్నీటితో; వెడలిన = పోయిన; ప్రాణముల్ = ప్రాణములు; తగన్ = లేచి; ప్రవిష్టములు = తిరిగివచ్చినవి; అటన్ = అని; అంచున్ = అనుచు; ఉబ్బుచున్ = పొంగిపోతూ.

భావము:– కొడుకులూ, పెద్దకోడలు మ్రొక్కగా, వారిని పైకి లేవదీసి చేతులతో నిమురుతు, ముఖాలు, తలలు ముద్దులు పెడుతూ, నవ్వుతూ ఒళ్ళోకి చేరదీసి సంతోషాశ్రువులతో వారిని తడిపారు. పోయిన ప్రాణాలు లేచి వచ్చాయి అంటూ పొంగిపోయారు.

9-332-వ.

అంత వసిష్ఠుం డరుగుదెంచి. శ్రీరామచంద్రుని జటాబంధంబు విడిపించి, కులవృద్ధులుం దానును సమంత్రకంబుగ దేవేంద్రుని మంగళస్నానంబు చేయించు బృహస్పతి చందంబున, సముద్రనదీజలంబుల నభిషేకంబు చేయించె; రఘువరుండును, సీతాసమేతుండై, జలకంబులాడి, మంచి పుట్టంబులు గట్టికొని, కమ్మని పువ్వులు దుఱిమి, సుగంధంబు లలందికొని, తొడవులు దొడిగికొని, తనకు భరతుఁడు సమర్పించిన రాజసింహాసనంబునం గూర్చుండి, యతని మన్నించి కౌసల్యకుఁ బ్రియంబు చేయుచు, జగత్పూజ్యంబుగ రాజ్యంబు జేయుచుండె; నప్పుడు.

టీక:- అంతన్ = అంతట; వసిష్ఠుండు = వసిష్ఠుడు; అరుగుదెంచి = వచ్చి; శ్రీరామచంద్రుని = శ్రీరామచంద్రప్రభువు; జటా = జటలుకట్టిన జుట్టు; బంధంబున్ = చిక్కు; విడిపించి = తీసి; కులవృద్ధులున్ = కులపెద్దలు; తానునున్ = అతను; సమంత్రంబుగ = మంత్రయుక్తముగ; దేవేంద్రుని = ఇంద్రుని; మంగళస్నానంబు = మంగళస్నానాలు; చేయించు = చేయించెడి; బృహస్పతి = బృహస్పతి; చందంబునన్ = వలె; సముద్ర = సముద్రపు; నదీ = నదుల; జలంబులన్ = నీటితో; అభిషేకంబున్ = స్నానము; చేయించెన్ = చేయించెను; రఘువరుండును = శ్రీరాముడును {రఘువరుడు - రఘు వంశపు శ్రేష్ఠుడు, రాముడు}; సీతా = సీతాదేవి; సమేతుండు = కూడా ఉన్నవాడు; ఐ = అయ్యి; జలకంబులు = స్నానములు; ఆడి = చేసి; మంచి = చక్కటి; పుట్టంబులున్ = బట్టలను; కట్టికొని = ధరించి; కమ్మని = సువాసనలుగల; పువ్వులున్ = పూలను; తుఱిమి = ముడిచికొని; సుగంధంబులన్ = సుగంధములను; అలందికొని = రాసుకొని; తొడవులున్ = ఆభరణములను; తొడిగికొని = అలంకరించుకొని; తన = తన; కున్ = కు; భరతుడు = భరతుడు; సమర్పించిన = అప్పగించిన; రాజ = పట్టపు; సింహాసనంబునన్ = సింహాసనముపై; కూర్చుండి = కూర్చుండి; అతనిన్ = అతనిని; మన్నించి = ఆదరించి; కౌసల్య = కౌసల్యాదేవి; కున్ = కి; ప్రియంబు = సంతోషము; చేయుచు = కలిగించుచు; జగత్ = లోకము; పూజ్యంబుగాన్ = పూజించునట్లు; రాజ్యంబున్ = రాజ్యమును; చేయుచున్ = ఏలుతూ; ఉండెను = ఉండెను; అప్పుడు = ఆ సమయమునందు.

భావము:- అంతట, ఇంద్రుడికి మంగళస్నానాలు చేయించె బృహస్పతి వలె, వసిష్ఠులవారు వచ్చి కులపెద్దలు తాను శ్రీరామచంద్రునికి జటలు కట్టిన జుట్టు చిక్కు తీసి, మంత్రయుక్తంగా పవిత్రమైన సముద్రపు నీటితో, నదుల నీటితో స్నానాలు చేయించారు. శ్రీరాముడు సీతాదేవి

స్నానాలు చేసి, చక్కటి బట్టలను ధరించి, సువాసనలుగల పూలు ముడిచికొని, సుగంధాలను రాసుకొని, ఆభరణాలు అలంకరించుకొని, తనకు భరతుడు అప్పగించిన పట్టపు సింహాసనంపై కూర్చున్నారు. భరతుని ఆదరిస్తూ, కౌసల్యాదేవి సంతోషించేలా, లోకం పూజించేలా రాజ్యం ఏలుతూ ఉన్నాడు. ఆ సమయంలో....

★9-333-సీ.

కలఁగు టెల్లను మానెఁ జలధు లేడింటికి-
జలనంబు మానె భూచక్రమునకు;
జాగరూకత మానె జలజలోచనునకు-
దీనభావము మానె దిక్పతులకు;
మాసి యుండుట మానె మార్తాండవిధులకుఁ-
గావిరి మానె దిగ్గగనములకు;
నుడిగిపోవుట మానె నుర్వీరుహంబుల-
కడఁగుట మానె ద్రేతాగ్నులకును;

9-333.1-ఆ.

గడిఁది వ్రేఁగు మానెఁ గరి గిరి కిటి నాగ
కమఠములకుఁ బ్రజల కలఁక మానె;
రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు
ధరణిభరణరేఖఁ దాల్చు నపుడు.

టీక:- కలగుట = సంక్షోభములు; ఎల్లను = సర్వమును; మానెన్ = లేకుండపోయినవి; జలధులు = సముద్రములు {సప్తసముద్రములు, సప్తజలధులు, సప్తసాగరములు - 1క్షార(కారపు సముద్రము) 2ఇక్షురస(చెరకురసముసముద్రము) 3సుర(సురాసముద్రము) 4ఆజ్య(నేయ్యిసముద్రము) 5క్షీర(పాలసముద్రము) 6దధి(పెరుగుసముద్రము) 7ఉదకంబులు(నీటిసముద్రము)}; ఏడింటికి =

ఏడింటికి (7); చలనంబు = కంపించుటలు; మానెన్ = లేకుండపోయినవి; భూచక్రమున్ = భూమండలమున; కున్ = కు; జాగరూకత = జాగ్రత్తపడుట; మానెన్ = అవసరములేకపోయెను; జలజలోచనున్ = విష్ణుమూర్తి; కున్ = కి; దీనభావము = దైన్యము; మానెన్ = లేకుండపోయినది; దిక్పతుల్ = దిక్పాలకుల; కున్ = కు; మాసి = వెలవెలపోయి; ఉండుట = ఉండుట; మానెన్ = పోయినది; మార్తాండ = సూర్యునికి; విధులకున్ = చంద్రునికి; కావిరి = నలుపురంగు; మానెన్ = పోయినది; దిక్ = దిక్కులు; గగనముల్ = ఆకాశముల; కున్ = కు; ఉడిగిపోవుట = ఎడిపోవుట; మానెన్ = పోయినది; ఉర్వీరుహంబుల = చెట్ల {ఉర్వీరుహము – ఉర్వి (భూమి)యందు పుట్టునది, చెట్టు}; కున్ = కు; అడగుట = అణగిపోవుట; మనెన్ = పోయినది; త్రేతాగ్నుల్ = త్రేతాగ్నుల {త్రేతాగ్నులు – 1గార్హపత్యము (గృహస్థునికి సంబంధించినది) 2దక్షిణాగ్ని (పితృదేవతలకి ఉద్దేశించినది) 3ఆహవనీయము (యజ్ఞమున ఇవ్వ యోగ్యమైనది) అను శ్రౌతాగ్నులు మూడు}; కునున్ = కు; కడిది = ఎక్కువ; వ్రేగు = భారము; ; మానెన్ = పోయినది; కరి = దిగ్గజములకు; గిరి = కులపర్వతములకు; కిటి = వరాహమూర్తికి; నాగ = ఆదిశేషునకు; కమఠముల = కూర్మమూర్తుల; కున్ = కు; ప్రజల్ = లోకుల; కున్ = కు; అలక = కలత; మానెన్ = పోయినది; రామచంద్రవిభుడు = శ్రీరామప్రభువు; రాజ = రాజులలో; ఇంద్ర = శ్రేష్ఠులలో; రత్నంబు = ఉత్తముడు; ధరణిభరణరేఖలన్ = భూభారమును; తాల్చున్ = వహించెడి; అపుడున్ = అప్పుడు.

భావము:– ఆ రామరాజ్యంలో సంక్షోభాలు లేవు. సప్త సముద్రాలు కంపించడం లేదు. భూమండలం నిర్భయంగా ఉంది. పాపులు లేకపోడంతో విష్ణుమూర్తి జాగరూకత అవసరం లేకపోయింది. దిక్పాలకులకు దైన్యం లేదు. సూర్య చంద్రులకు వెలవెల పోవటం లేదు. దిక్కులు ఆకాశాలకు కావిరంగు పట్టటంలేదు. చెట్లు ఎండిపోవుటం లేదు. త్రేతాగ్నులు అణగిపోవుటం లేదు. భూభారం తగ్గడంతో భూమిని మోసే ఆ దిగ్గజాలకు, కులపర్వతాలకు, వరాహమూర్తికి, ఆదిశేషుడికి, కూర్మమూర్తికి భారం తగ్గిపోయింది. లోకులకు కలతలు లేవు. అలా శ్రీరాముడు రాజ్యం ఏలాడు. అప్పుడు...

## 9-334-వ.

మఱియును.

టీక:– మఱియును = ఇంకను.

భావము:– ఇంకను.

9-335-సీ.

పొలఁతుల వాలుచూపుల యంద చాంచల్య-
మబలల నడుముల యంద లేమి;
కాంతాలకములంద కౌటిల్యసంచార-
మతివల నడపుల యంద జడిమ;
ముగుదల పరిరంభముల యంద పీడన-
మంగనాకుచముల యంద పోరు;
పడఁతుల రతులంద బంధసద్భావంబు-
సతులఁబాయుటలంద సంజ్వరంబు;

9-335.1-తే.

ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు
లంద చౌర్యంబు; వల్లభు లాత్మ సతుల
నాఁగి క్రొమ్ముళ్ళు పట్టుటం దక్రమంబు;
రామచంద్రుఁడు పాలించు రాజ్యమందు.

టీక:- పొలతుల = స్త్రీల; వాలుచూపుల = వాడిచూపుల; అంద = లోనే; చాంచల్యము = అస్థిరత్వము, చపలత్వం; అబలల = స్త్రీల; నడుముల = నడుముల; అందన్ = లోనే; లేమి = తక్కువగుటలు, బీదతనం; కాంత = స్త్రీల; అలకములు = శిరోజములు; అందన్ = లోనే; కౌటిల్య = వంకరగ, కుటిలత్వపు; సంచారము = తిరుగుటు, వర్తన; అతివల = స్త్రీల; నడపుల = నడకల; అంద = లోనే; జడిమ = మాంద్యము, బద్ధకము; ముగుదల = స్త్రీల; పరిరంభముల = ఆలింగనమలు; అంద = లోనే; పీడనము = అణచుట, నొక్కుట; అంగనా = స్త్రీల; కుచముల = స్తనములు; అంద = అందే; పోరు = సంఘర్షణ, ఒరిపిడి; పడతుల = స్త్రీల; రతులు = కలయికలు; అంద = లోనే; బంధసత్ = కట్టివేయు, బంధించే; భావంబు = ఉద్దేశ్యము, బుద్ధి; సతులన్ = స్త్రీలను; పాయుటలు = విరహములు; అంద = లోనే; సంజ్వరంబు = తాపము, అనారోగ్యం; ; ప్రియులు = ప్రియులు; ప్రియురాండ్ర = ప్రియురాళ్ళ; మనములన్ = మనసు లందు; బెరసి = వ్యాపించి; తార్పులు = తార్చుటల; అందన్ = లోనే; చౌర్యంబు = దొంగపనులు; వల్లభులు = భర్తలు; అత్మ = తమ; సతులన్ = భార్యలను; ఆగి = అడ్డగించి; క్రొమ్ముళ్ళు = జడలు; పట్టుటలు = పట్టుకొనుటలు; అంద = లోనే; అక్రమంబు = అక్రమములు, మోసగించుటలు; రామచంద్రుడు = శ్రీరాముడు; పాలించు = ఏలెడి; రాజ్యము = రాజ్యము; అందు = లో.

భావము:– శ్రీరాముని పాలనలో ఉన్న రాజ్యం రామరాజ్యం. ఆ రామరాజ్యం అంతా ఎంత ధర్మ బద్ధంగా సాగింది అంటే; స్త్రీల వాలుచూపులలో మాత్రమే చాంచల్యం కనిపించేది; వనితల నడుములలో మాత్రమే పేదరికం ఉండేది; నెలతల తలవెంట్రుకలలో మాత్రమే కౌటిల్యం ఉండేది; తరుణుల నడకలలో మాత్రమే మాంద్యం ఉండేది; నెలతల కౌగలింతలలో మాత్రమే పీడన ఉండేది; కామినుల స్తనాల్లో మాత్రమే ఘర్షణ ఉండేది; సతులతో కలయికల్లో మాత్రమే బంధనాలు ఉండేవి; కాంతల ఎడబాటులలో మాత్రమే సంతాపం ఉండేది; ఎవరి ప్రియురాండ్ర మనసు వారు తెలిసి దొంగిలించుటలో మాత్రమే దొంగతనాలు ఉండేవి; ప్రియభార్యలను భర్తలు అడ్డగించి జడలుపట్టుకొని లాగటంలో మాత్రమే అక్రమాలు ఉండేవి;

★9–336–క.

తండ్రి క్రియ రామచంద్రుఁడు
తండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపన్
తండ్రుల నందఱు మఱచిరి
తండ్రిగదా రామచంద్రధరణిపుఁ డనుచున్.

టీక:– తండ్రి = కన్నతండ్రి; క్రియన్ = వలె; రామచంద్రుడు = శ్రీరాముడు; తండ్రులన్ = కన్నతండ్రులను; మఱపించి = మరిపించి; ప్రజలన్ = లోకులను; తాన్ = తను; రక్షింపన్ = ఏలుతుండగా; తండ్రులన్ = కన్నతండ్రులను; అందఱున్ = అందరు; మఱచిరి = మరచిపోయిరి; తండ్రి = తండ్రి; కదా = కదా; రామచంద్ర = రామయ్యతండ్రి అనెడి; ధరణిపుడు = రాజు {ధరణిపుడు – ధరణిని ఏలెడివాడు, రాజు}; అనుచున్ = భావించుచు.

భావము:– శ్రీరాముడు కన్నతండ్రిలా పరిపాలిస్తుండటంతో. ప్రజలు అందరూ మా తండ్రి శ్రీరాముడే అని అనుకుంటున్నారు. కనుక రామ పాలనలోని ప్రజలు అందరు తమ కన్నతండ్రులను సైతం మరచిపోయారు.

9–337–వ.

మఱియు, నా రామచంద్రుండు రాజర్షిచరితుండును, నిజధర్మనిరతుండును, నేకపత్నీవ్రతుండును, సర్వలోకసమ్మతుండును నగుచు ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లనుభవించుచుఁ ద్రేతాయుగంబైన గృతయుగధర్మంబుఁ గావించుచు, బాలమరణంబు మొదలగు నరిష్టంబులు ప్రజలకుఁ గలుగకుండ రాజ్యంబుచేయుచుండె; నయ్యెడ

టీక:– మఱియున్ = ఇంకను; ఆ = ఆ; రామచంద్రుండు = శ్రీరాముడు; రాజర్షి = రాజఋషులవంటి; చరితుండును = నడవడికలవాడు; నిజ = స్వ; ధర్మ = ధర్మమునందు; నిరతుండును = నిష్ఠకలవాడు; ఏకపత్నీవ్రతుండును = ఏకపత్నీవ్రతుడు {ఏకపత్నీవ్రతుడు – జీవితములో ఒకే భార్య అనెడి వ్రతదీక్ష కలవాడు, శ్రీరాముడు}; సర్వ = సమస్తమైన; లోక = లోకులచేత; సమ్మతుండును = అంగీకరింపబడువాడు; అగుచు = ఔతూ; ధర్మ = దర్మమునకు; విరోధంబు = వ్యతిరేకము; కాకుండన్ = కానివిధముననే; కోరికలున్ = కోరికలను; అనుభవించుచున్ = తీర్చుకొంటూ; త్రేతాయుగంబున్ = త్రేతాయుగము; ఐనన్ = అయినను; కృతయుగ = కృతయుగపు; ధర్మంబున్ = ధర్మములను; కావించుచు = నడపించుచు; బాలమరణంబు = చిన్నపిల్లలుచనిపోవుట; మొదలగు = మున్నగు; అరిష్టంబులు = కీడులు; ప్రజల = లోకుల; కున్ = కు; కలుగకుండ = కలగనివ్వకుండ; రాజ్యంబున్ = రాజ్యమును; చేయుచుండెన్ = ఏలుచుండెను; అయ్యెడ = అప్పుడు.

భావము:– ఇంకను, ఆ శ్రీరాముడు రాజఋషివంటివాడు; స్వధర్మంలో నిష్ఠ కలవాడు; ఏకపత్నీవ్రతుడు; లోకులందరికీ ఆమోదయోగ్యుడు; ధర్మమువ్యతిరేకం కాని విధంగానే కోరికలను తీర్చుకొంటూ త్రేతాయుగం అయినా కృతయుగ ధర్మాలను నడపిస్తూ ఏలుతున్నాడు; చిన్నపిల్లలు చనిపోవడం లాంటి లోకులకు కీడులు కలగనివ్వకుండ రాజ్యం ఏలుతున్నాడు. అప్పుడు.

★9-338-ఆ.

సిగ్గుపడుట గల్గి సింగారమును గల్గి
భక్తిగల్గి చాల భయముఁ గలిగి
నయముఁ బ్రియముఁ గల్గి నరనాథు చిత్తంబు
సీత దనకు వశము చేసికొనియె.

టీక:– సిగ్గుపడుట = సిగ్గుపడుట; కల్గి = ఉండి; సింగారమును = శృంగారము; కల్గి = ఉండి; భక్తి = శ్రద్ధ; కల్గి = ఉండి; చాల = మిక్కిలి; భయమున్ = భయము; కల్గి = ఉండి; నయము = మృదుత్వము; ప్రియమున్ = ప్రీతి; కల్గి = ఉండి; నరనాథున్ = రాజుయొక్క; చిత్తంబున్ = మనసును; సీత = సీతాదేవి; తన = తన; కున్ = కు; వశము = అనుకూలముగ; చేసికొనియె = చేసుకొనెను.

భావము:– సీతాదేవి సిగ్గుపడుట, శృంగారాలంకారం, శ్రద్ధ, భయభక్తులు, నయము, ప్రీతి కలిగి మెలగుతూ రాజు శ్రీరాముని మనసును తన వశం చేసుకుంది.”

9-339-వ.

అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.

టీక:- అనినన్ = అనగా; విని = విని; పరీక్షిత్ = పరీక్షిత్తు అనెడి; నరేంద్రుండు = రాజు; ఇట్లు = ఈ విధముగ; అనియ = పలికెను.

భావము:- అని శుకుడు చెప్పగా పరీక్షిత్తు ఇలా అడిగాడు.

9-340-ఆ.

"భ్రాతృజనుల యందు బంధువులందును
ప్రజల యందు రాజభావ మొంది
యెట్లు మెలఁగె? రాఘవేశ్వరుం డెవ్వనిఁ
గూర్చి క్రతువు లెట్లు గోరి చేసె?"

టీక:- భ్రాతు = సోదరుల; జనుల = అందరి; అందున్ = ఎడ; బంధువులు = బంధువులు; అందును = ఎడ; ప్రజల = లోకుల; అందున్ = ఎడ; రాజభావము = రాజుననెడి తలపు; ఒంది = కలిగుండి; ఎట్లు = ఏ విధముగ; మెలగెన్ = మసలుకొనెను; రాఘవేశ్వరుండు = శ్రీరాముడు; ఎవ్వనిన్ = ఎవరిని; కూర్చి = ఉద్దేశించి; క్రతువులు = యాగములు; ఎట్లు = ఏ విధముగ; కోరి = పూని; చేసెన్ = ఆచరించెను.

భావము:- "శ్రీరాముడు సోదరులు, బంధువులు, లోకులు ఎడ మహారాజుగా ఎలా మసిలాడు. ఎవరిని ఉద్దేశించి యాగాలు ఏ విధంగా ఆచరించాడు."

9-341-వ.

అనిన శుకుం డిట్లనియె.

టీక:- అనినన్ = అనగా; శుకుండు = శుకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా పరీక్షిత్తు అడుగగా శుకముని ఇలా అన్నాడు.

9-342-సీ.

"భగవంతుఁడగు రామభద్రుండు ప్రీతితో-
దేవోత్తముని సర్వదేవమయునిఁ
దనుఁదాన కూర్చి యధ్వరములు చేసెను-
హోతకుఁ దూరుపు నుత్తరంబు
సామగాయకునికి శమనదిగ్భాగంబు-
బ్రహ్మకుఁ గ్రమమునఁ బడమ రెల్ల
నధ్వర్యునకు శేష మాచార్యునకు నిచ్చి-
సొమ్ములఁ బంచి భూసురుల కొసఁగి

9-342.1-తే.

తనదు రెండు పుట్టంబులు దనకు నయిన
మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క
వినతుఁడై యుండె; నా రాము వితరణంబు
పాండవోత్తమ! యేమని పలుకవచ్చు?

టీక:- భగవంతుడు = సాక్షాత్ భగవంతుడే; అగు = ఐన; రామభద్రుండు = శ్రీరాముడు; ప్రీతితో = ఇష్టపూర్తిగా; దేవోత్తముని = విష్ణుమూర్తి {దేవోత్తముడు - దేవతలలో ఉత్తముడు, విష్ణువు.}; సర్వదేవమయునిన్ = విష్ణుమూర్తి {సర్వదేవమయుడు - సమస్తమైన దేవతలు తానైన వాడు, విష్ణువు}; తనున్ = తనను; తాన = తనే; కూర్చి = ఉద్దేశించి, గురించి; అధ్వరములు = యజ్ఞములు; చేసెను = చేసెను; హోత = హోత; కున్ = కు; తూరపున్ = తూర్పుభాగము {హోత - ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు}; ఉత్తరంబున్ = ఉత్తరపు భాగము; సామగాయకుని = సామవేదముపాడెడివాని; కిన్ = కి; శమన = దక్షిణపు; దిక్ = దిక్కు; భాగంబున్ = భాగమును; బ్రహ్మ = ఋత్వికుని; కున్ = కి; పడమర = పడమరవైపు భాగము; ఎల్లన్ = అంతటిని; అధ్వర్యున్ = యాగాధ్వర్యముచేయువాని; కు = కి; శేషమున్ = మిగిలినది; ఆచార్యున్ = గురువున; కున్ = కు; ఇచ్చి = ఇచ్చివేసి; సొమ్ములన్ = సంపదలను; పంచి = పంచిపెట్టి; భూసురుల్ = విప్రుల; కున్ = కు; ఒసగి = ఇచ్చివేసి;

; తనదు = తనయొక్క; రెండు = రెండు; పుట్టంబులున్ = వస్త్రములు; తన = తన; కున్ = కు; అయిన = చెందిన; మెలత = భార్య; మంగళసూత్రంబు = మంగళసూత్రపు; మినుకు = బిళ్ళ; తక్క = తప్పించి; వినతుడు = వినయముకలవాడు; ఐ = అయ్యి; ఉండెన్ = ఉండెను; ఆ = ఆ; రాము = శ్రీరాముని; వితరణంబు =

దానశీలత; పాండవోత్తమ = పరీక్షిత్తు {పాండవోత్తముడు – పాండువంశము నందు ఉత్తముడు, పరీక్షిత్తు}; ఏమని = ఎంతని; పలుకవచ్చు = పొగడగలము.

భావము:– "ఓ పాండవోత్తమా! పరీక్షిత్తూ! సాక్షాత్తు భగవంతుడే ఐన శ్రీరాముడు వినయవంతుడు ప్రీతితో తానే అయిన విష్ణుమూర్తి గురించి అనేక యాగాలు చేసాడు. హోతకు తూర్పుదిక్కు, సామగానం చేసిన వానికి ఉత్తరపు దిక్కు, ఋత్వికునికి దక్షిణపు దిక్కు, అధ్వర్యనికి పడమర దిక్కు, మిగిలినది గురువునకు ఇచ్చివేసాడు. తనకు రెండు వస్త్రాలు, తన భార్యకు మంగళసూత్రంబిళ్ళ ఉంచుకుని మిగిలిన సంపదలను విప్రులకు పంచిపెట్టాడు. ఆ శ్రీరాముని దానశీలత ఎంతని పొగడగలము.

## 9-343-వ.

అంత నా రామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు దమతమ భూములు మరల నిచ్చి యిట్లనిరి.

టీక:– అంతన్ = అంతట; ఆ = ఆ; రామచంద్రుని = శ్రీరాముని; దానశీలత్వంబున్ = వితరణబుద్ధి; కున్ = కి; మెచ్చి = మెచ్చుకొని; విప్ర = బ్రాహ్మణ; వరులు = ఉత్తములు; తమతమ = వారందరి; భూములున్ = భూములను; మరలన్ = వెనుకకు; ఇచ్చి = ఇచ్చివేసి; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:– అంతట, శ్రీరాముడి వితరణబుద్ధికి మెచ్చుకొని బ్రాహ్మణులు వారందరు ఆయా భూములు వెనుకకు ఇచ్చివేసి ఇలా అన్నారు.

## 9-344-ఆ.

"ధరణి వలదు మాకుఁ దపసుల కేల? నీ
వఖిలలోక గురుఁడవైన హరివి;
మా మనంబు లందు మలయు చీఁకటిఁ బాపు
భవ దుదారరుచులఁ బార్థివేంద్ర!"

టీక:– ధరణి = భూమి; వలదు = వద్దు; మా = మా; కున్ = కు; తపసుల్ = మునుల; కి = కి; ఏల = ఎందుకు; నీవు = నీవు; అఖిల = సమస్తమైన; లోక = లోకములకు; గురుడవు = పూజింపబడెడివాడవు; హరివి = విష్ణుమూర్తివి; మా = మా; మనంబుల్ = మనసులందు; అందున్ = లో; మలయు = కమ్ముకొన్న; చీకటిన్ = అజ్ఞానమును; పాపు = పోగొట్టుము; భవత్ = నీయొక్క; ఉదార = దయ అనెడి; రుచులన్ = కాంతులతో; పార్థివేంద్ర = రాజ {పార్థివేంద్రుడు – పార్థివుల (రాజుల)లో ఇంద్రునివంటివాడు, రాజు.}.

భావము:– "రాజా! మునులం అయిన మాకు రాజ్యం ఎందుకు, వద్దు, నీవు సకల లోకాలకు

పూజనీయుడవు. విష్ణుమూర్తివి.. నీ దయా కిరణాలు ప్రసరించి, మా మనసులలో కమ్ముకొన్న అజ్ఞాన అంధకారాన్ని పోగొట్టుము."

9-345-వ.

అని పలికి బ్రహ్మణ్యదేవుండైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు చని; రిట్లు పెద్దకాలంబు రాజ్యంబుచేసి, రాఘవేంద్రుం డొక్కదినంబున.

టీక:- అని = అని; పలికి = చెప్పి; బ్రహ్మణ్య = ఉత్తమ; దేవుండు = దేవుడు; ఐనన్ = అయినట్టి; రామచంద్రుని = శ్రీరాముని; వినయ = వినయయుక్తములగు; ఉక్తులన్ = స్తుతులతో; పూజించి = పూజించి; మునులు = ఋషులు; చనిరి = వెళ్ళిరి; ఇట్లు = ఇలా; పెద్ద = చాలా; కాలంబున్ = కాలము; రాజ్యంబున్ = రాజ్యపాలనము; చేసి = చేసి; రాఘవేంద్రుండు = శ్రీరాముడు; ఒక్క = ఒకానొక; దినంబునన్ = రోజు.

భావము:- అని చెప్పి ఆ మునులు దేవోత్తముడైన శ్రీరాముని వినయ వినమ్రులై పూజించి వెళ్ళిపోయారు. ఇలా చాలా కాలం రాజ్యపాలనం చేసి శ్రీరాముడు ఒక రోజు...

## శ్రీరామాదుల వంశము

9-346-సీ.

వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు-
కొఱకునై రాముండు గూఢవృత్తి
నడురేయి దిరుగుచో నాగరజనులలో-
నొక్కఁడు దన సతి యొప్పకున్న
"నొరునింటఁ గాపురంబున్న చంచలురాలిఁ-
బాయంగలేక చేపట్ట నేమి
తా వెఱ్ఱి యగు రామధరణీశ్వరుండనే-
బేల! పొ"మ్మను మాట బిట్టు పలుక

9-346.1-ఆ.

నాలకించి మఱియు నా మాట చారుల
వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రపోవఁ జెప్పక వాల్మీకి
పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి.

టీక:- వసుధ = లోకము; పైన్ =మీద; పుట్టెడు = కలిగెడు; వార్తలున్ = విశేషములు; ఆకర్ణించు = వినుట; కొఱకున్ = కోసము; ఐ = అయ్యి; రాముండు = రాముడు; గూఢ = రహస్య; వృత్తిన్ = సంచారమున; నడురేయి = అర్థరాత్రి; తిరుగుచోన్ = తిరుగుతుండగ; నాగరజనుల = పౌరుల {నాగరజనులు - నగరములోనుండెడి జనులు, పౌరులు, సంస్కారవంతులు}; లోన్ = అందు; ఒక్కడు = ఒకానొకడు; తన = తనయొక్క; సతి = భార్య; ఒప్పక = సరిగలేక; ఉన్నన్ = ఉండగ; ఒరున్ = ఇతరుని; ఇంటన్ = నివాసములో; కాపురంబున్న = నివాసించిన; చంచలురాలిన్ = చంచలస్వభావిని; పాయంగన్ = విడువ; లేక = లేకపోవుటచేత; చేపట్టన్ = ఏలుకొనుటకు; ఏమి = ఏమైనా; తాన్ = తను; వెఱ్ఱి = వెఱ్ఱివాడు; అగు = అయిన; రామ = రాముడు అనెడి; ధరణీశ్వరుండనే = రాజునా ఏమి, కాదు {ధరణీశ్వరుడు - ధరణి (భూమికి) ప్రభువు, రాజు}; బేల = పడతి; పొమ్ము = వెళ్ళిపో; అను = అనెడి; మాటన్ = మాటలతో; బిట్టుపలుక =

కేకలేస్తుండగ; ఆలించి = విని;

; మఱియున్ = అంతేకాక; ఆ = ఆ; మాట = విషయము; చారుల = వేగుల; వలన = వలన; జగము = లోకము; లోన్ = అందు; కలుగన్ = వ్యాపించి ఉండుట; తెలిసి = తెలిసికొని; సీత = సీతాదేవి; నిద్రపోవన్ = నిద్రించుచుండగ; చెప్పక = చెప్పకుండగ; వాల్మీకి = వాల్మీకియొక్క; పర్ణశాలన్ = ఆశ్రమములో; పెట్టన్ = విడిచిపెట్టిరమ్మని; పనిచెన్ = ఆజ్ఞాపించెను; రాత్రి = రాత్రిసమయమునందు.

భావము:– రాజ్యంలో జరిగే విశేషాలు స్వయంగా తెలుసుకోడానికి రాముడు మారువేషంలో తిరుగుతున్నాడు. అర్ధరాత్రి ప్రజల్లో ఒకడు భార్యతో దెబ్బలాడి, "పరాయి ఇంటిలో కొన్నాళ్ళ కాపురం చేసిన చంచలురాలైన భార్యను ఏలుకోడానికి నేనేమైనా వెఱ్ఱిరాముడను అనుకున్నావా? పోపో." అని కేకలేస్తుంటే శ్రీరాముడు విన్నాడు. అంతేకాక, చారుల ద్వారా ఈ విషయం లోకంలో వ్యాపించి ఉందని తెలిసికొన్నాడు. ఆదమరచి నిద్రిస్తున్న సీతాదేవిని చెప్పకుండ రాత్రివేళ వాల్మీకి ఆశ్రమంలో విడిచిపెట్టి రమ్మని ఆజ్ఞాపించాడు.

## 9-347-వ.

అంత; సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడి కొడుకులం గనియె; వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె; లక్ష్మణునకు నంగదుండును, జంద్రకేతుండును భరతునకుఁ దక్షుండును, బుష్కలుండును శత్రుఘ్నునకు సుబాహుండును, శ్రుతసేనుండును సంభవించి; రయ్యెడ.

టీక:– అంతన్ = అంతట; సీతయున్ = సీతాదేవి; గర్భిణి = కడుపుతో ఉన్నామె; కావునన్ = కనుక; కుశలవులు = కుశలవులు; అనెడి = అను; కొడుకులన్ = పుత్రులను; కనియెన్ = జన్మమిచ్చెను; వారి = వారల; కిన్ = కు; వాల్మీకి = వాల్మీకి; జాతకర్మంబులున్ = జాతకర్మములు {జాతకర్మ – వ్యు. జ్యాతే కర్మ, షోడశకర్మములలో శిశువు పుట్టినప్పుడు చేయు కర్మము}; ఒనరించెన్ = చేసెను; లక్ష్మణున్ = లక్ష్మణున; కున్ = కు; అంగదుండును = అంగదుడు; చంద్రకేతుండును = చంద్రకేతుడు; భరతున్ = భరతున; కున్ = కు; దక్షుండును = దక్షుడు; పుష్కలుండును = పుష్కలుడు; శత్రుఘ్నున్ = శత్రుఘ్ని; కున్ = కి; సుబాహుండును = సుబాహువు; శ్రుతసేనుండును = శ్రుతసేనుడు; సంభవించిరి = పుట్టిరి; ఆ = ఆ; ఎడన్ = సమయమునందు.

భావము:– అంతట, అప్పటికే కడుపుతో ఉన్న సీతాదేవి కుశలవులను అను పుత్రులను కన్నది. వారికి వాల్మీకి జాతకర్మలు చేసాడు. లక్ష్మణునకు అంగదుడు, చంద్రకేతుడు; భరతునకు దక్షుడు, పుష్కలుడు; శత్రుఘ్నునికి సుబాహువు, శ్రుతసేనుడు అని ఇద్దరేసి కొడుకులు పుట్టారు. అప్పుడు.

9-348-క.

బంధురబలుఁడగు భరతుఁడు
గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధుఁ డగు నన్న కిచ్చెను
బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్.

టీక:- బంధుర = చక్కటి; బలుడు = బలశాలి; అగు = ఐన; భరతుడు = భరతుడు; గంధర్వ = గంధర్వుల; చయంబున్ = సమూహమును; త్రుంచి = సంహరించి; కనక = బంగారము; ఆదులన్ = మున్నగునవి; సద్బంధుడు = సజ్జనులబంధువైనవాడు; అగు = అయిన; అన్న = సోదరుని; కిన్ = కి; ఇచ్చెన్ = ఇచ్చెను; బంధువులును = బంధువులు; మాతృజనులున్ = తల్లులు {తల్లులు - కౌసల్య సుమిత్ర కైకేయి }; ప్రజలున్ = లోకులు; మెచ్చన్ = మెచ్చుకొనగా.

భావము:- బలశాలి అయిన భరతుడు బంధువులు, కౌసల్యాది తల్లులు, లోకులు మెచ్చేలా, గంధర్వులను సంహరించి ధనాన్ని, బంగారాన్ని తీసుకువచ్చి సజ్జనబంధువైన సోదరుడు శ్రీరాముడికి ఇచ్చాడు.

9-349-ఆ.

మధువనంబులోన మధునందనుం డగు
లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు చేసె మధుభాషి శత్రుఘ్నుఁ
డన్న రామచంద్రుఁ డౌ ననంగ.

టీక:- మధువనంబులోనన్ = మధువనమునందు; మధు = మధువు అనెడి రాక్షసుని; నందనుండు = పుత్రుడు; అగు = ఐన; లవణున్ = లవణుని; చంపి = సంహరించి; భుజబలంబున్ = బాహుబలము; మెఱసి = ప్రకాశింపజేసి; మధుపురంబున్ = మధుపురమును; చేసె = నిర్మించెను; మధు = మధురముగ; భాషి = మాట్లాడువాడు; శత్రుఘ్నుడు = శత్రుఘ్నుడు; అన్న = సోదరుడు; రామచంద్రుడు = శ్రీరాముడు; ఔననగన్ = మెచ్చుకొనగా.

భావము:- మధురభాషి శత్రుఘ్నుడు తన అన్న రామచంద్రుడు మెచ్చేలా, మధురాసురుని కొడుకు లవణుడిని సంహరించి మధువనంలో మధుపురాన్ని నిర్మించాడు.

9-350-వ.

అంతఁ గొంతకాలంబునకు రామచంద్రుని కొమారులయిన కుశ లవులిద్దఱను వాల్మీకివలన వేదాదివిద్యల యందు నేర్పరులై పెక్కు సభల సతానంబుగా రామకథాశ్లోకంబులు పాడుచు నొక్కనాఁడు రాఘవేంద్రుని యజ్ఞశాలకుం జని.

టీక:- అంతన్ = అంతట; కొంత = కొన్ని; కాలంబున్ = దినముల; కున్ = కు; రామచంద్రుని = శ్రీరాముని; కొమరులు = పుత్రులు; అయిన = ఐన; కుశలవులు = కుశుడు లవుడు అను; ఇద్దఱను = ఇద్దరు; వాల్మీకి = వాల్మీకి; వలన = వల్ల; వేద = వేదము; ఆది = మున్నగు; విద్యల = విద్యల; అందున్ = లో; నేర్పరులు = ఆరితేరినవారు; ఐ = అయ్యి; పెక్కు = అనేక; సభలన్ = సభలయందు; సతానంబుగా = స్వరసహితముగా {తానము - సంగీతమున స్వరముల ప్రస్తార విశేషము, సంగీత పారిభాషిక పదము}; రామ = శ్రీరాముని; కథా = కథా; శ్లోకంబులున్ = శ్లోకములను; పాడుచున్ = గానముచేయుచు; ఒక్క = ఒకానొక; నాడు = దినమున; రాఘవేంద్రుని = శ్రీరాముని; యజ్ఞశాల = యాగశాల; కున్ = కు; చని = వెళ్ళి.

భావము:- అంతట కొన్నాళ్ళకు శ్రీరాముని పుత్రులు ఐన కుశుడు లవుడు ఇద్దరు వాల్మీకి వలన వేదాది విద్యలలో ఆరితేరారు. అనేక సభలలో స్వరసహితముగా శ్రీరామకథా శ్లోకాలు పాడుతూ ఉన్నారు. ఆ క్రమంలో ఒక దినం శ్రీరాముని యాగశాలకు వెళ్ళి...

9-351-మత్త.

వట్టి మ్రాకులు పల్లవింప నవారియై మధుధార దా
నుట్టఁబాడిన వారిపాటకు నుర్వరాధిపుఁడుం బ్రజల్
బిట్టు సంతస మంది; రయ్యెడఁ బ్రీతిఁ గన్నుల బాష్పముల్
దొట్ట నౌఁదల లూఁచి వారలతోడి మక్కువ పుట్టఁగాన్.

టీక:- వట్టి = పసిమిచెడిన, ఎండిపోయిన; మ్రాకులు = మోళ్ళు; పల్లవింపన్ = చిగురించగా; అవారి = అపరిమితమైనది; ఐ = అయ్యి; మధు = అమృత; ధార = ధారలు; తాను = తమంత తాము; ఉట్టన్ = ఒలికేటట్టులుగా; పాడినన్ = పాడగా; వారి = వారియొక్క; పాట = పాట; కున్ = కు; ఉర్వరాధిపుడున్ = మహారాజు {ఉర్వరాధిపుడు - ఉర్వర (భూమికి) అధిపుడు (ప్రభువు), రాజు}; ప్రజలున్ = ప్రజలు; బిట్టు = మిక్కిలి, గట్టిగా; సంతసమున్ = సంతోషమును; అందిరి = పొందిరి; అయ్యెడ = అప్పుడు; ప్రీతిన్ = ప్రేమతో; కన్నులన = కన్నులమ్మట; భాష్పముల్ = కన్నీరు; తొట్టన్ = తొణికిసలాడగ; ఔదలల్ = తలలను; ఊచి = ఊపి; వారల = వారి; తోడి = తోటి; మక్కువలు = కూరిమి; పుట్టగాన్ = కలుగగా.

భావము:- ఆ విధంగా శ్రీరాముని యాగసాలలో ఎండిన మోళ్ళు చిగురించేలా, అమృత

ధారలు జాలువారేలా పాడారు. వారి పాటను మహారాజు, ప్రజలు అందరూ తలలూపుతూ, ఆనందభాష్పాలు కారుతుండగా మిక్కిలి సంతోషించారు. అప్పుడు, వారిపై ఎక్కువ మక్కువ కలిగింది.

9-352-వ.

అంతనా రామచంద్రుండు కుమారుల కిట్లనియె.

టీక:- అంతన్ = అంతట; ఆ = ఆ; రామచంద్రుండు = శ్రీరాముడు; కుమారుల = పిల్లల; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అప్పుడు శ్రీరాముడు పిల్లలతో ఇలా అన్నాడు.

★9-353-ఆ.

"చిన్నయన్నలార! శీతాంశుముఖులార!
నళినదళవిశాలనయనులార!
మధురభాషులార! మహిమీఁద నెవ్వరు
దల్లిదండ్రి మీకు ధన్యులార? "

టీక:- చిన్ని = చిన్న; అన్నలారా = చక్కటి పిల్లలు; శీతాంశు = చంద్రుని వంటి; ముఖులారా = మోములు కలవారు; నళిన = కలువ; దళ = రేకులవంటి; విశాల = పెద్ద; నయనులారా = కన్నులు కల వారు; మధుర = తియ్యని; భాషులార = మాట్లాడువారు; మహి = భూమి; మీదన్ = పైన; ఎవ్వరు = ఎవరు; తల్లిదండ్రి = తల్లదండ్రులు; మీ = మీ; కున్ = కు; ధన్యులార = పుణ్యవంతులు.

భావము:- ఓ చిన్ని బాబులు! మీ మోములు చంద్రబింబాల్లా ప్రకాశిస్తున్నాయి. మీ కన్నులు కలువరేకులలా వెడల్పుగా అందంగా ఉన్నాయి. మీ పలుకు మధురంగా ఉన్నాయి. లోకంలో మీలాంటి వారి తల్లిదండ్రులు ధన్యులు; మీ తల్లిదండ్రులు ఎవరు నాయనలారా?
– అని మర్యాదకు మారుపేరైన శ్రీరామచంద్రమూర్తి తన యజ్ఞశాలకి వచ్చి రామకథ గానం చేస్తున్న కుశలవులను ప్రశ్నించాడు. పోతనగారి పాత్రౌచిత్య, సందర్భోచిత్యమైన లలిత పదాలు, నడక లాలిత్యం ఈ మృదు మధురమైన పద్యంలో ప్రతిఫలిస్తున్నాయి.

9-354-వ.

అనిన వార "లేము వాల్మీకి పౌత్రులము; రాఘవేశ్వరుని యాగంబు చూడ వచ్చితి" మనవుడు; మెల్లన నగి "యెల్లి ప్రొద్దున మీ తండ్రి నెఱింగెద; రుండుం" డని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె; మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని యనేక ప్రకారంబుల వినుతించి; యిట్లనియె.

టీక:- అనినన్ = అనగా; వారలు = వారు; ఏము = మేము; వాల్మీకి = వాల్మీకి; పౌత్రులము = మనుమలము; రాఘవేశ్వరుని = శ్రీరాముని; యాగంబున్ = యజ్ఞమును; చూడన్ = చూచుటకు; వచ్చితిమి = వచ్చాము; అనవుడు = అనగా; మెల్లన = మెల్లిగా; నగి = నవ్వి; యెల్లి = రేపు; ప్రొద్దున = ఉదయము; మీ = మీయొక్క; తండ్రిన్ = తండ్రిని; ఎఱింగెదరు = తెలిసికొనెదరు; రండు = రండి; అని = అని; ఒక్క = ఒకానొక; నివాసంబున్ = గృహమున; కున్ = కు; సత్కరించి = గౌరవించి; పనిచెన్ = పంపించెను; మఱు = తరువాత; నాడు = దినమున; సీతన్ = సీతను; తోడ్కొని = వెంటబెట్టుకొని; కుశలవులన్ = కుశలవులను; ముందటన్ = ముందు; ఇడుకొని = ఉంచుకొని; వాల్మీకి = వాల్మీకి; వచ్చి = వచ్చి; రఘుపుంగవునిన్ = శ్రీరాముని {రఘుపుంగవుడు - రఘువంశములో శ్రేష్ఠుడు, రాముడు}; కని = చూసి; అనేక = పెక్కు; ప్రకారంబులన్ = విధములుగ; వినుతించి = స్తుతించి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇలా అడిగిన శ్రీరామునితో వారు ఇలా అన్నారు. "మేము వాల్మీకి మనుమలం. శ్రీరాముని యాగం చూడ్డానికి వచ్చాం." వారి పలుకులు విని మెల్లిగా నవ్వి, "రేపు ఉదయం మీ తండ్రిని తెలుసుకుందురు గాని, రండి." అని సత్కరించి పంపించాడు. మరునాడు వాల్మీకిమహర్షి సీతను, కుశలవులను వెంటబెట్టుకొని వచ్చి శ్రీరాముని పెక్కువిధములుగా స్తుతించి ఇలా అన్నాడు.

9-355-ఆ.

"సీత సుద్దరాలు, చిత్తవాక్కర్మంబు
లందు సత్యమూర్తి యమలచరిత
పుణ్యసాధ్వి విడువఁ బోలదు చేకొను
రవికులాబ్ధిచంద్ర! రామచంద్ర!"

టీక:- సీత = సీతాదేవి; సుద్దరాలు = స్వచ్ఛమైనామె; చిత్త = మనసు; వాక్ = మాట; కర్మంబులు = చేతలు; అందున్ = లోను; సత్య = సత్యనిష్ఠగల; మూర్తి = స్వరూపి; అమల = పరిశుద్ధమైన; చరిత = వర్తనకలామె; పుణ్య = పుణ్యాత్మురాలు; సాధ్వి = పతివ్రత; విడువన్ = విడుచుట; పోలదు = తగినపనికాదు;

చేకొను = స్వీకరించుము; రవికులాబ్ధిచంద్ర = శ్రీరామ {రవికులాబ్ధిచంద్రుడు – సూర్య వంశము అనెడి సముద్రమునకు చంద్రుని వంటివాడు, రాముడు}; రామచంద్ర = శ్రీరామ.

భావము:– "రామా! రవికులాబ్ధిసోమా! సీతాదేవి పవిత్రురాలు త్రికరణ శుద్ధిగా (మనోవాక్కాయకర్మలలోను) సత్యనిష్ఠగల సాధ్వి, పరిశుద్ధ వర్తనురాలు, మహాపుణ్యాత్మురాలు, పతివ్రత. ఈమెను విడుచుట తగినపని కాదు. స్వీకరించు."

## 9-356-వ.

అని వాల్మీకి పలుక, రామచంద్రుండు పుత్రార్థి యై విచారింపఁ, గుశ లవులను వాల్మీకికి నొప్పగించి, రామచంద్రచరణధ్యానంబు చేయుచు నిరాశ యై సీత భూవివరంబు జొచ్చె; నయ్యెడ.

టీక:– అని = అని; వాల్మీకి = వాల్మీకి; పలుకన్ = చెప్పగా; రామచంద్రుండు = శ్రీరాముడు; పుత్ర = కొడుకుల; అర్థి = కోసము; ఐ = అయ్యి; విచారింపన్ = విచారించగా; కుశలవులను = కుశలవులను; వాల్మీకి = వాల్మీకి; కిన్ = కి; అప్పగించి = అప్పచెప్పి; రామచంద్ర = శ్రీరాముని; చరణ = పాదములను; ధ్యానంబు = ధ్యానము; చేయుచున్ = చేస్తూ; నిరాశ = నిరాశచెందినామె; ఐ = అయ్యి; సీత = సీతాదేవి; భూవివరంబున్ = భూగర్భములోనికి; చొచ్చెన్ = ప్రవేశించెను; అయ్యెడ = అప్పుడు.

భావము:– అని వాల్మీకి చెప్పగా, శ్రీరాముడు కొడుకుల గురించి విచారించాడు. నిరాశచెందిన సీతాదేవి, వాల్మీకికి కుశలవులను అప్పచెప్పి, భర్త పాదాలు ధ్యానిస్తూ భూగర్భములోకి ప్రవేశించింది. అప్పుడు...

## 9-357-మ.

"ముదితా! యేటికిఁ గ్రుంకి తీవు మనలో మోహంబు చింతింపవే
వదనాంభోజము చూపవే మృదువు నీ వాక్యంబు విన్పింపవే
తుది చేయం దగ" దంచు నీశ్వరుఁడునై దుఃఖించె భూపాలుఁ డా
పదగాదే ప్రియురాలిఁ బాసిన తఱిన్ భావింప నెవ్వారికిన్?"

టీక:– ముదితా = ఓ కాంతా; ఏటికిన్ = ఎందుకు; క్రుంకితి = కుంగిపోయితివి; ఈవు = నీవు; మన = మనమధ్య; లోన్ = అందు; మోహంబున్ = ప్రీతి; చింతింపవే = ఆలోచింపుము; వదన = మోము అనెడి; అంభోజమున్ = పద్మమును; చూపవే = చూపుము; మృదువు = మృదువైనవి; నీ = నీయొక్క; వాక్యంబున్ = మాటలు; విన్పింపవే = వినిపించుము; తుదిన్ = విడిపోవుట; చేయన్ = చేయుటకు; తగదు = తగినది; అంచున్ = అనుచు; ఈశ్వరుండును = భగవంతుడును; ఐ = అయ్యి; దుఃఖించె = శోకించెను; భూపాలుడు =

మహారాజు; ఆపద = ఆపదే; కాదే = కాదా, అవును; ప్రియురాలిన్ = ప్రియురాలిని; పాసిన = దూరమైన; తఱిన్ = వేళ; భావింపన్ = తరచిచూసినచో; ఎవ్వారికిన్ = ఎలాంటివారికైనను.

భావము:– తాను భగవంతుడే అయినా రాముడు సీత కోసం దుఃఖిస్తూ, ఇలా అన్నాడు. "ఓ కాంతా! అయ్యో నీవు ఎందుకు భూమిలోకి కుంగిపోయావు. మన మధ్య ఉన్న ప్రేమను గుర్తుచేసుకో. నీ ముఖపద్మాన్ని చూపించు. నీ మృదుమధుర వాక్కులు వినిపించు. ఇలా నన్ను విడిచి పోవద్దు." అవును, ఎంతటివారికి అయినా ప్రియురాలు దూరమైతే దుఃఖం కలగుతుంది కదా..

## 9-358-వ.

అని వగచి, రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి, పదుమూఁడువేల యేం డ్లెడతెగకుండ నగ్నిహోత్రంబు చెల్లించి తా నీశ్వరుండు గావునఁ దన మొదలినెలవుకుం జనియె నివ్విధంబున.

టీక:– అని = అని; వగచి = బాధపడి; రామచంద్రుండు = శ్రీరాముడు; బ్రహ్మచర్యంబు = బ్రహ్మచర్యమును; ధరియించి = చేపట్టి; పదుమూడువేల = పదమూడువేల(13,000); ఏండ్లు = సంవత్సరములు; ఎడతెగకుండన్ = ఎడతెగకుండ; అగ్నిహోత్రంబున్ = హోమమును; చెల్లించి = నడిపించి; తాన్ = అతను; ఈశ్వరుండు = భగవంతుడు; కావునన్ = కనుక; తన = తనయొక్క; మొదలినెలవు = మూలస్థానము; కున్ = కు; చనియెన్ = వెళ్ళిపోయెను; ఈ = ఈ; విధంబునన్ = విధముగ.

భావము:– ఇలా బాధపడిన శ్రీరాముడు బ్రహ్మచర్యం చేపట్టి పదమూడువేల (13,000) సంవత్సరాలు ఎడతెగకుండా హోమాలు నడిపించి భగవంతుడు కనుక తన మూలస్థానం పరమపదానికి వెళ్ళిపోయాడు. ఈ విధంగా....

## ★9-359-ఆ.

ఆదిదేవుఁడైన యా రామచంద్రుని
కబ్ధి గట్టు టెంత యసురకోటి
జంపు టెంత కపుల సాహాయ్య మది యెంత
సురల కొఱకుఁ గ్రీడ జూపెఁగాక.

టీక:– ఆదిదేవుడు = మూలాధారదేవుడు; ఐన = అయినట్టి; ఆ = ఆ; రామచంద్రుని = రామచంద్రుని; కిన్ = కి; అబ్ధి = సముద్రమునకు; కట్టుట = సేతువుకట్టుట; ఎంత = ఎంతపాటిపని; అసుర = రాక్షస; కోటి = సమూహమును; చంపుట = సంహరించుట; ఎంత = అది ఎంతపని; కపుల = వానరుల; సాహాయ్యము = తోడు; అది = అది; ఎంత = ఏపాటిది; సురల = దేవతల; కొఱకున్ = కోసము; క్రీడ = లీలలు; చూపెన్ =

చూపించెను; కాక = తప్పించి.

భావము:- దేవతల కోసం లీలలు చూపించడానికి తప్పించి, ఆదిదేవుడైన ఆ రామచంద్ర మూర్తికి సముద్రానికి సేతువు కట్టుట అనగా ఎంతపని? రాక్షససంహారం అనగా ఎంతపని? ఆయనకు వానరులు తోడా అది ఏపాటిదనవచ్చు?

9-360-చ.

వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధి విజృంభణతా నివర్తికిన్
దశదిగధీశమౌళిమణి దర్పణమండిత దివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని దైత్యపతిం బొరిగొన్న జెట్టికిన్.

టీక:- వశుడుగన్ = వినమ్రుడనుగా; మ్రొక్కెదన్ = నమస్కరించెదను; లవణవార్ధి = ఉప్పుసముద్రముయొక్క; విజృంభణా = అహంకారమును; నివర్తి = అణచినవాని; కిన్ = కి; దశ = పది {దశదిశలు - నాలుగు (4)దిక్కులు (1తూర్పు 2దక్షిణము 3పడమర 4ఉత్తరము) నాలుగు (4) మూలలు (5ఈశాన్యము 6ఆగ్నేయము 7నైరృతి 8వాయవ్యము) 9పైన 10 కింద}; దిక్ = దిక్కుల; అధీశ = ప్రభువుల; మౌళి = కిరీటములందలి; మణి = మణులు అనెడి; దర్పణ = దర్పణములలో; మండిత = ప్రకాశించుతున్న; దివ్య = గొప్ప; కీర్తి = యశస్సుగలవాని; కిన్ = కి; దశశత = వెయ్యి (1000); బాను = సూర్యులతో సమానమైన; మూర్తి = ప్రకాశముగల స్వరూపి; కిన్ = కి; సుధా = అమృతమువలె; రుచి = తియ్యగా; భాషి = మాట్లాడెడివాని; కిన్ = కి; సాధు = సాధుపురుషులను; పోషి = పోషించువాని; కిన్ = కి; దశరథ = దశరథుడు అనెడి; రాజు = రాజుయొక్క; పట్టి = కుమారుని; కిని = కి; దైత్యపతిన్ = రావణాసురుని {దైత్యపతి - రాక్షసరాజు, రావణాసురుడు}; పొరిగొన్న = సంహరించిన; జెట్టి = వీరుని; కిన్ = కి.

భావము:- సాగరుని అహంకారం సర్వం అణచినవానికి; సకల దిక్పాలకుల కిరీటాలలోని మణులు అనె దర్పణాలలో ప్రతిఫలించే గొప్ప యశస్సు గలవానికి; వేలసూర్యులతో సమానమైన ప్రకాశంగల మహామూర్తికి; అమృతం అంత మధురంగా మాట్లాడు వానికి; సాధులను పాలించువానికి; దశరథరాజు కుమారునికి; రావణాసురుని సంహరించిన వీరునికి; వినమ్రుడనై మ్రొక్కుతాను.

★9-361-ఉ.

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు గడు విప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డిచ్చుత మా కభీష్టముల్.

టీక:- నల్లనివాడు = నల్లగా ఉండువాడు; పద్మ = పద్మములవంటి; నయనంబులవాడు = కన్నులుగలవాడు; మహా = గొప్ప; ఆశుగంబులున్ = బాణములు; విల్లునున్ = బాణాసనమును; తాల్చువాడు = ధరించెడివాడు; కడు = మిక్కిలి; విప్పు = విశాలమైనది; అగు = అయిన; వక్షమువాడు = రొమ్ము గలవాడు; మేలున్ = శుభములు; పైన్ = మీద; జల్లెడువాడు = కురిపించువాడు; నిక్కిన = ఉన్నతమైన; భుజంబులవాడు = భుజములు కల వాడు; యశంబున్ = కీర్తిని; దిక్కులన్ = దిక్కుల కడవరకు; జల్లెడువాడు = వ్యాపించినవాడు; ఐన = అయినట్టి; రఘుసత్తముడు = రఘువంశపు తిలకుడు; ఇచ్చుత = తీర్చుగాక; మా = మా; కున్ = కు; అభీష్టముల్ = కోరికలు.

భావము:- నల్లటివాడు, పద్మాలవంటి కళ్ళు గలవాడు, గొప్ప ధనుస్సు బాణాలు ధరించు వాడు, విశాలమైన వక్షస్థలం గలవాడు, మేళ్ళు అనేకం సమకూర్చువాడు, ఎగుభుజాలు గలవాడు, అన్ని దిక్కులకు తన కీర్తిని వ్యాపింపజేసిన వాడు, రఘు కులోత్తముడు అయిన శ్రీరామచంద్రుడు మా కోరికలు తీర్చుగాక.

9-362-ఆ.

రామచంద్రుఁ గూడి రాకలఁ బోకలఁ
గదిసి తిరుగువారుఁ గన్నవారు
నంటికొన్నవారు నా కోసలప్రజ
లరిగి రాదియోగు లరుగు గతికి.

టీక:- రామచంద్రున్ = శ్రీరాముని; కూడి = కలిసి; రాకలపోకలన్ = మెలయుటయందు; కదిసి = చేరి; తిరుగు = నడచెడి; వారున్ = వారు; కన్న = చూచిన; వారున్ = వారు; అంటికొన్న = తాకిన; వారున్ = వారు; ఆ = ఆ; కోసల = కోసలదేశపు; ప్రజలున్ = ప్రజలు; అరిగిరి = వెళ్ళిరి; ఆదియోగులు = ఆదియోగులు; అరుగు = వెళ్ళెడి; గతి = సద్గతి; కి = కి.

భావము:- శ్రీరామునితో కలిసిమెలసి మెలగిన వారు; తనివితీరా చూసిన వారు; ప్రేమతో తాకిన వారు అయిన ఆ కోసల ప్రజలు ఆదియోగులు పొందే సద్గతిని పొందారు.

9-363-క.

మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నీంతనపూర్వమహాఘ ని
కృంతనములు రామనామ కృతి చింతనముల్.

టీక:- మంతనములున్ = ఏకాంతమార్గములు; సద్గతుల్ = మోక్షముల; కున్ = కు; పొంతనములు = పొందిపజేయునవి {పొంతనము - మైత్రి కలిగించునది, గ్రహమైత్రి}; ఘనములు = గొప్పవి; ఐన = అయినట్టి; పుణ్యముల్ = పుణ్యఫలములు; కిన్ = కి; తాన్ = తను; ఇంతన = ఇప్పుడు; పూర్వ = పూర్వముచేసిన; మహా = గొప్ప; అఘ = పాపములను; నికృంతనములు = త్రెంచునవి; రామ = శ్రీరాముని; నామ = పేరుతో; కృత = చేసెడి; చింతనముల్ = సంస్మరణలు.

భావము:- శ్రీరామచంద్రమూర్తిని గుఱించి చేసెడు తలపులు సద్గతులు కలిగించే ఏకాంతమార్గములు, గొప్ప పుణ్యాలు కలిగిస్తాయి. పూర్వజన్మలలోను , యీ జన్మలోను చేసిన పాపాలను తొలగిస్తాయి. అవి మహిమాన్వితములు.

9-364-వ.

ఆ రామచంద్రునకుఁ గుశుండును, గుశునకు నతిథియు, నతిథికి నిషధుండును, నిషధునకు నభుండును, నభునికిఁ బుండరీకుండును బుండరీకునకు క్షేమధన్వుండును, క్షేమధన్వునకు దేవానీకుండును, దేవానీకునకు నహీనుండును, నహీనునకుఁ బారియాత్రుండును, బారియాత్రునకు బలుండును, బలునకుఁ జలుండును, జలునకు నర్కసంభవుం డగు వజ్రనాభుండును, వజ్రనాభునకు శంఖణుండును, శంఖణునకు విధృతియు, విధృతికి హిరణ్యనాభుండును జనియించి; రతండు జైమిని శిష్యుండైన యాజ్ఞవల్కముని వలన నధ్యాత్మయోగంబు నేర్చి, హృదయకలుషంబులం బాసి యోగచర్యుండయ్యె నా హిరణ్యనాభునకుఁ బుష్యుండును, బుష్యునకు ధ్రువసంధియు, ధ్రువసంధికి సుదర్శనుండును, సుదర్శనునకు నగ్నివర్ణుండును, నగ్నివర్ణునకు శీఘ్రుండును, శీఘ్రునకు మరువను రాజశ్రేష్ఠుండును బుట్టి: రా

రాజయోగి సిద్ధుండయి కలాపగ్రామంబున నున్నవాఁడు కలియుగాంతంబున నష్టంబయ్యెడు సూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపంగలవాఁ; డా మరువునకుఁ బ్రశుశ్రుకుండును, నా ప్రశుశ్రుకునకు సంధియు, నతనికి నమర్షణుండును, నా యమర్షణునికి మహస్వంతుండును, నా మహస్వంతునకు విశ్వసాహ్యుండును, నా విశ్వసాహ్యునకు బృహద్బలుండును, జనియించి; రా బృహద్బలుఁడు భారతయుద్ధంబున మీ తండ్రి యగు నభిమన్యు చేత హతుండయ్యె; వినుము.

టీక:– ఆ = ఆ; రామచంద్రున్ = శ్రీరాముని; కున్ = కి; కుశుండున్ = కుశుడు; కుశున్ = కుశుని; కున్ = కి; అతిథియున్ = అతిథి; అతిథి = అతిథి; కిన్ = కి; నిషధుండును = నిషధుడు; నిషధున్ = నిషధుని; కున్ = కి; నభుండును = నభుడు; నభున్ = నభుని; కిన్ = కి; పుండరీకుండును = పుండరీకుడు; పుండరీకున్ = పుండరీకున్; కున్ = కి; క్షేమధన్వుండును = క్షేమధన్వుడును; క్షేమధన్వున్ = క్షేమధన్వుని; కున్ = కి; దేవానీకుండును = దేవనీకుడును; దేవానీకున్ = దేవానీకుని; కున్ = కి; అహీనుండును = అహీనుడు; అహీనున్ = అహీనుని; కున్ = కి; పారియాత్రుండును = పారియాత్రుడు; పారియాత్రున్ = పారియాత్రుని; కున్ = కి; బలుడును = బలుడు; బలున్ = బలుని; కున్ = కి; చలుండును = చలుడు; చలున్ = చలుని; కున్ = కి; అర్కసంభవుండు = సూర్యాంశతో పుట్టినవాడు; అగు = ఐన; వజ్రనాభుండును = వజ్రనాభుడు; వజ్రనాభున్ = వజ్రనాభుని; కున్ = కి; శంఖణుండును = శంఖణుడు; శంఖణున్ = శంఖణుని; కున్ = కి; విధృతియున్ = విధృతి; విధృతి = విధృతి; కిన్ = కి; హిరణ్యనాభుండును = హిరణ్యనాభుడు; జనియించిరి = పుట్టిరి; అతండు = అతడు; జైమిని = జైమినియొక్క; శిష్యుండు = శిష్యుడు; ఐన = అయినట్టి; యజ్ఞవల్క = యజ్ఞవల్కుడు అనెడి; ముని = ఋషి; వలనన్ = నుండి; అధ్యాత్మయోగంబున్ = అధ్యాత్మయోగమును; నేర్చి = నేర్చుకొని; హృదయ = చిత్తములోని; కలుషంబులన్ = పాపములను; పాసి = విడిచిపెట్టి; యోగచర్యుండు = యోగము ఆచరించువాడు; అయ్యెన్ = అయ్యెను; ఆ = ఆ; హిరణ్యనాభున్ = హిరణ్యనాభుని; కున్ = కి; పుష్యుండును = పుష్యుడు; పుష్యున్ = పుష్యుని; కున్ = కి; ధ్రువసంధియున్ = ధ్రువసంధి; ధ్రువసంధి = ధ్రువసంధి; కిన్ = కి; సుదర్శనుండును = సుదర్శనుడు; సుదర్శనున్ = సుదర్శనుని; కున్ = కి; అగ్నివర్ణుండును = అగ్నివర్ణుడు; అగ్నివర్ణున్ = అగ్నివర్ణుని; కున్ = కి; శీఘ్రుండును = శీఘ్రుండు; శీఘ్రున్ = శీఘ్రుని; కున్ = కి; మరువు = మరువు; అను = అనెడి; రాజ = రాజులలో; శ్రేష్ఠుండును = శ్రేష్ఠుడు; పుట్టిరి = జన్మించిరి; ఆ = ఆ; రాజయోగి = రాజర్షి; సిద్ధుండు = సిద్ధిపొందినవాడు; అయి = ఐ; కలాప = కలాప అనెడి; గ్రామంబునన్ = ఊరిలో; ఉన్నవాడు = ఉన్నాడు; కలియుగ = కలియుగపు; అంతంబునన్ = చివరలో; నష్టంబయ్యెడు = నాశనమైపోయెడి; సూర్యవంశంబున్ = సూర్యవంశము; క్రమ్మఱన్ = మరల; పుట్టింపగలవాడు = ప్రతిష్ఠించబోవుచున్నాడు; ఆ = ఆ; మరువున్ = మరువున; కున్ = కు; ప్రశుశ్రుకుండును = ప్రశుశ్రుకుడు; ఆ = ఆ; ప్రశుశ్రుకున్ = ప్రశుశ్రుకుని; కున్ = కి; సంధియున్ = సంధి; అతని = అతని; కిన్ = కి; అమర్షణుండును = అమర్షణుడు; ఆ = ఆ; అమర్షణుండును = అమర్షణుని; కిన్ = కి; మహస్వంతుండును = మహస్వంతుడు; ఆ = ఆ; మహస్వంతున్ = మహస్వంతుని; కున్ = కి; విశ్వసాహ్యుండును =

విశ్వసాహ్యుడు; ఆ = ఆ; విశ్వసాహ్యున్ = విశ్వసాహ్యుని; కున్ = కి; బృహద్బలుండును = బృహద్బలుడు; జనియించిరి = పుట్టిరి; ఆ = ఆ; బృహద్బలుడు = బృహద్బలుడు; భారతయుద్ధంబునన్ = భారతయుద్ధమునందు; మీ = మీయొక్క; తండ్రి = తండ్రి; అగు = ఐన; అభిమన్యు = అభిమన్యుని; చేతన్ = చేతిలో; హతుండు = మరణించినవాడు; అయ్యెన్ = అయ్యెను; వినుము = వినుము.

భావము:– శ్రీరామునికి కుశుడు; కుశునికి అతిథి; అతిథికి నిషధుడు; నిషధునికి నభుడు; నభునికి పుండరీకుడు; పుండరీకునికి క్షేమధన్వుడును; క్షేమధన్వునికి దేవనీకుడును; దేవానీకునికి అహీనుడు; అహీనునికి పారియాత్రుడు; పారియాత్రునికి బలుడు; బలునికి చలుడు; చలునికి సూర్యాంశతో పుట్టిన వజ్రనాభుడు; వజ్రనాభునికి శంఖణుడు; శంఖణునికి విధృతి; విధృతికి హిరణ్యనాభుడు పుట్టారు. అతడు జైమిని శిష్యుడైన యజ్ఞవల్క మహర్షి నుండి అధ్యాత్మయోగం నేర్చుకొని హృదయంలోని కలతలు అన్నీ విడిచిపెట్టి యోగం ఆచరించాడు. ఆ హిరణ్యనాభునికి పుష్యుడు; పుష్యునికి ధ్రువసంధి; ధ్రువసంధికి సుదర్శనుడు; సుదర్శనునికి అగ్నివర్ణుడు; అగ్నివర్ణునికి శీఘ్రుడు; శీఘ్రునికి మరువు అనె రాజశ్రేష్ఠుడు జన్మించారు. ఆ రాజర్షి యోగసిద్ధి పొంది కలాపగ్రామంలో ఇప్పటికి ఉన్నాడు. కలియుగం చివరలో నాశనమైపోయే సూర్యవంశాన్ని మరల ప్రతిష్టిస్తాడు. ఆ మరువునకు ప్రశుశ్రుకుడు; ఆ ప్రశుశ్రుకునికి సంధి; అతనికి అమర్షణుడు; ఆ అమర్షణునికి మహస్వంతుడు; ఆ మహస్వంతునికి విశ్వసాహ్యుడు; ఆ విశ్వసాహ్యునికి బృహద్బలుడు పుట్టారు. ఆ బృహద్బలుడు భారతయుద్ధంలో మీ తండ్రి అభిమన్యుని చేతిలో మరణించాడు. వినుము.

https://telugubhagavatam.org/

ఇంకావుంది

9-365-తే.

పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలు
దుదయుఁ గాఁగల రాజులఁ దోడుతోడ
నెఱుఁగఁ జెప్పితి నీవారి; నింకమీఁదఁ
బుట్టఁ గలవారిఁ జెప్పెద భూవరేంద్ర!

టీక:- పరగన్ = ప్రసిద్ధముగ; ఇక్ష్వాకుడును = ఇక్ష్వాకుడు; బృహద్బలుడు = బృహద్బలుడు; మొదలున్ = మొదటివానిగ; తుదయున్ = చివరివానిగ; కల = ఉన్నట్టి; రాజులన్ = రాజులను గురించి; తోడుతోడన్ = వరుసగా; ఎఱుగన్ = తెలియ; చెప్పితిన్ = జేసితిని; నీ = నీకు సంబంధించిన; వారిన్ = వారిని; ఇంకమీదన్ = ఇకపైన; పుట్టగల = పుట్టబోయెడి; వారిన్ = వారిని గురించి; చెప్పెదన్ = తెలిపెదను; భూవరేంద్ర = రాజా {భూవరేంద్రుడు - భూవర (రాజులలో) ఇంద్ర (శ్రేష్ఠుడు), మహారాజు}.

భావము:- రాజా! ఇక్ష్వాకుడితో మొదలుపెట్టి బృహద్బలుడు వరకు ఉన్న ప్రసిద్ధ రాజులు గురించి వివరంగా చెప్పాను. ఇకపై పుట్టబోయే వారిని గురించి నీకు చెప్తాను.

9-366-వ.

ఆ బృహద్బలునకు బృహద్రణుండును బృహద్రణునకు నురుక్షతుండును, నాతనికి వత్సప్రీతుండును, వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును, బ్రతివ్యోమునకు భానుండును, భానునకు సహదేవుండును, సహదేవునకు బృహదశ్వుండును, బృహదశ్వునకు భానుమంతుండును, భానుమంతునకుఁ బ్రతీకాశ్వుండును, బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును, సుప్రతీకునకు మేరుదేవుండును, మేరుదేవునకు సుతక్షత్రుండును, సుతక్షత్రునకు ఋక్షకుండును, ఋక్షకునకు నంతరిక్షుండును, నంతరిక్షునకు సుతపుండును, సుతపునకు నమిత్రజిత్తును, నతనికి బృహద్వాజియు, నతనికి బర్హియు, బర్హికి ధనంజయుండును, ధనంజయునకు రణంజయుండును, నతనికి సృంజయుండును, సృంజయునకు శాక్యుండును, శాక్యునకు శుద్ధాదుండును, శుద్ధాదునకు లాంగలుండును, లాంగలునకుఁ బ్రసేనజిత్తును, నతనికి క్షుద్రకుండును, క్షుద్రకునకు ఋణకుండును, ఋణకునకు

సురథుండును, సురథునకు సుమిత్రుండును బుట్టుదురు; సుమిత్రుని యనంతర కాలంబున సూర్యవంశంబు నశింపఁ గలదు వీరలు బృహద్బలునినుండి క్రమంబునం బుట్టం గలవార” లని చెప్పి శుకుం డిట్లనియె.

టీక:– ఆ = ఆయొక్క; బృహద్బలున్ = బృహద్బలుని; కున్ = కి; బృహద్రణుండును = బృహద్రణుడు; బృహద్రణున్ = బృహద్రణుని; కున్ = కు; ఉరుక్షతుండును = ఉరుక్షతుడు; అతని = అతని; కిన్ = కి; వత్సప్రీతుండును = వత్సప్రీతుడు; వత్సప్రీతున్ = వత్సప్రీతుని; కున్ = కి; ప్రతివ్యోముండును = ప్రతివ్యోముడు; ప్రతివ్యోమున్ = ప్రతివ్యోమున; కున్ = కు; భానుండును = భానుడు; భానున్ = భానున; కున్ = కు; సహదేవుండును = సహదేవుడు; సహదేవుని = సహదేవుని; కున్ = కి; బృహదశ్వుండును = బృహదశ్వుడు; బృహదశ్వున్ = బృహదశ్వుని; కున్ = కి; భానుమంతుండును = భానుమంతుడు; భానుమంతున్ = భానుమంతుని; కున్ = కి; ప్రతీకాశ్వుండును = ప్రతీకాశ్వుడు; ప్రతీకాశ్వున్ = ప్రతీకాశ్వున; కున్ = కు; సుప్రతీకుండును = సుప్రతీకుడు; సుప్రతీకున్ = సప్రతీకున; కున్ = కు; మేరుదేవుండును = మేరుదేవుడు; మేరుదేవున్ = మేరుదేవున; కున్ = కు; సుతక్షత్రుండును = సుతక్షత్రుడు; సుతక్షత్రున్ = సుతక్షత్రున; కున్ = కు; బుక్షకుండును = బుక్షకుడు; బుక్షకున్ = బుక్షకున; కున్ = కు; అంతరిక్షుండును = అంతరిక్షుడు; అంతరిక్షున్ = అంతరిక్షున; కున్ = కు; సుతపుండును = సుతపుడు; సుతపున్ = సుతపున; కున్ = కు; అమిత్రజిత్తున్ = అమిత్రజిత్తు; అతను = అతని; కిన్ = కి; బృహద్వాజియున్ = బృహద్వాజి; అతనిన్ = అతని; కిన్ = కి; బర్హియున్ = బర్హి; బర్హి = బర్హి; కిన్ = కి; ధనంజయుండును = ధనంజయుడు; ధనంజయున్ = ధనంజయున; కున్ = కు; రణంజయుండును = రణంజయుడు; అతనిన్ = అతని; కిన్ = కి; సృంజయుండును = సృంజయుడు; సృంజయున్ = సృంజయున; కున్ = కు; శాక్యుండును = శాక్యుండు; శాక్యున్ = శాక్యున; కున్ = కు; శుద్ధాదుండును = శుద్ధాదుడు; శుద్ధాదున్ = శుద్ధాదున; కున్ = కు; లాంగలుండును = లాంగలుడు; లాంగలున్ = లాంగలుని; ప్రసేనజిత్తున్ = ప్రసేనజిత్తు; అతనిన్ = అతని; కిన్ = కి; క్షుద్రకుండును = క్షుద్రకుడు; క్షుద్రకున్ = క్షుద్రకున; కున్ = కు; బుణకుండును = బుణకుండును; బుణకున్ = బుణకున; కున్ = కి; సురథుండును = సురథుడు; సురథున్ = సురథున; కున్ = కు; సుమిత్రుండును = సుమిత్రుడు; పుట్టుదురు = పుట్టబోవుచున్నారు; సుమిత్రుని = సుమిత్రుని; అనంతర = ఆతరువాత; కాలంబున్ = కాలమునందు; సూర్యవంశంబున్ = సూర్యవంశము; నశింపగలదు = నశించిపోవును; వీరలు = వీరు; బృహద్బలుని = బృహద్బలుని; నుండి = నుండి; క్రమంబునన్ = వరుసగా; పుట్టంగల = పుట్టబోయెడి; వారలు = వారు; అని = అని; చెప్పి = తెలియజెప్పి; శుకుండు = శుకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:– ఆ బృహద్బలునికి బృహద్రణుడు; బృహద్రణునికి ఉరుక్షతుడు; అతనికి వత్సప్రీతుడు; వత్సప్రీతునికి ప్రతివ్యోముడు; ప్రతివ్యోమునకు భానుడు; భానునకు సహదేవుడు; సహదేవునికి బృహదశ్వుడు; బృహదశ్వునికి భానుమంతుడు; భానుమంతునికి ప్రతీకాశ్వుడు; ప్రతీకాశ్వునకు సుప్రతీకుడు; సప్రతీకునకు మేరుదేవుడు; మేరుదేవునకు సుతక్షత్రుడు;

సుతక్షత్రునకు ఋక్షకుడు; ఋక్షకునకు అంతరిక్షుడు; అంతరిక్షునకు సుతపుడు; సుతపునకు అమిత్రజిత్తు; అతనికి బృహద్వాజి; అతనికి బర్హి; బర్హికి ధనంజయుడు; ధనంజయునకు రణంజయుడు; అతనికి సృంజయుడు; సృంజయునకు శాక్యుండు; శాక్యునకు శుద్ధాదుడు; శుద్ధాదునకు లాంగలుడు; లాంగలునికి ప్రసేనజిత్తు; అతనికి క్షుద్రకుడు; క్షుద్రకునకు ఋణకుండు; ఋణకునికి సురథుడు; సురథునకు సుమిత్రుడు పుడతారు. సుమిత్రుని తరువాత సూర్యవంశం నశించిపోతుంది. వీరు బృహద్బలుని తరువాత పుట్టబోయే వారు." అని జెప్పి శుకమహర్షి మరల ఇలా చెప్పసాగాడు.



ఇంకావుంది

## స్తుతి

9-734-క.

జనకసుతాహృచ్చోరా!

జనకవచోలబ్ధవిపిన శైలవిహారా!

జనకామితమందారా!

జనకాది మహీశ్వరాతిశయసంచారా!

టీక:- జనక సుతా హృచ్చోరా = శ్రీరామా {జనకసుతాహృచ్చోరుడు - జనకునిపుత్రిక సీత హృదయము దోచుకొన్నవాడు, రాముడు}; జనక వచోలబ్ధ విపిన శై లవిహారా = శ్రీరామా {జనకవచోలబ్ధవిపినశైలవిహారుడు - తండ్రి మాటవల్ల లభించిన అరణ్యాలలో పర్వతాలలో సంచారము కలవాడు, రాముడు}; జన కామిత మందారా = శ్రీరామా {జనకామితమందారుడు - ప్రజల కామితములు తీర్చు కల్పవృక్షము వంటివాడు, రాముడు}; జనకాది మహీశ్వ రాతిశయ సంచారా = శ్రీరామా {జనకాదిమహీశ్వరాతిశయసంచారుడు - జనకుడు మున్నగు రాజర్షులను మించిన ప్రవర్తన కలవాడు, రాముడు .}.

భావము:- జనకమహారాజు పుత్రిక సీతాదేవి మనసు దోచుకున్న ఆదర్శ భర్తవు. తండ్రి మాట నిలబెట్టడం కోసం కొండకోనలలో తిరిగి కష్టాలు అనుభవించిన ఆదర్శ పుత్రుడవు. ప్రజల కోరికలను తీర్చుటలో కల్పవృక్షము వంటి ఉత్తమ పాలకుడవు. జనకమహారాజు లాంటి రాజర్షులను సైతం మించిన గొప్ప నడవడికగల మహారాజువి. అయినట్టి శ్రీరామచంద్రప్రభు! నీకు వందనములు.

ఇంకావుంది

ఉపాఖ్యానంత గద్యం :–

ఇది జాతీయమహాకవి బమ్మెఱ పోతనామాత్య విరచితంబైన శ్రీమత్తెలుగు భాగవత మహాపురాణము నందలి నవమ స్కంధాంతర్గత శ్రీరాముని కథనంబు, శ్రీరామాదుల వంశము, భవిష్యద్రాజేతిహాసము యను వృత్తాంతములు కల శ్రీ పోతన రామాయణము అను ఉపాఖ్యానము.

టీక:– భవిష్యద్రాజేతిహాసము = పరీక్షిత్కాలానికి భవిష్యత్తు కాలంలోని రాజుల చరిత్ర.

సర్వం శ్రీకృష్ణార్పణ మస్తు

ఓం ఓం ఓం

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వేజనాస్సుఖినోభవంతు

---